## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద

గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీ మాత



రచన

'సాధన రహస్య-సర్వసిద్ధాంత సౌరభాది' బహు గ్రంథకర్తలు, 'శ్రీ రామకృష్ణాశ్రమముల' (బాపట్ల, భీమునిపట్నం) సంస్థాపకులు, శ్రీశ్రీశ్రీ అనుభవానంద స్వాములవారి శిష్యులు

## శ్రీ మాతాజీ త్యాగీశానందపురి

# వినతి

అమ్మ . గురించి ఏదైనా మంచిగ్రంథం వుంటే బాగుండునని ఎంతోకాలంగా మనస్సులో ఒక ఉబలాటం, కోరిక.

శ్రీశ్రీశ్రీ మాతాజీవారిని 'అమ్మా! ఏదైనా ఒక పుస్తకం వ్రాసి ఇవ్వండి, అచ్చు వేయిస్తామన్నాను. 'సరే, చూస్తాను లేవయ్యా' అన్నారు. ఈ సంవత్సరం తప్పక ఒక పుస్తకం అచ్చు వేయిద్దామనుకుని, అమ్మకు ఒక జాబు వ్రాశాను. అమ్మ 'వెంటనే వ్రాసి యిస్తా'నని వారం తిరగక ముందే ఈ 'శ్రీమాత' వ్రాసి యిచ్చారు. అనుకోకుండా, నా మనస్సులో వున్నదే, నాకు కావలసిందే, వ్రాసి యిచ్చారు. అదే అమ్మ మనస్సు.

అమ్మ భీముని పట్నంలో వుంటారు. ఇక్కడ అచ్చువేయటం, ప్రూఫులు చూడటం ఎట్లా అను కుంటున్నాను. మా ప్రియమిత్రులు, సహృదయులు ఆచార్య చిన్నికృష్ణయ్యగారు గుర్తుకొచ్చారు. వారు తత్క్షణం, 'ఇది శ్రీమాత ఆదేశం, నా అదృష్టం' అన్నారు. అది వారి సంస్కారానికి చిహ్నం.

ఈ గ్రంథం ప్రచురణం ఎలా చేస్తే బాగుంటుందని ఆలోచిస్తుంటే, అపుడు దగ్గరవున్న మా చిన్నబ్బాయి చిరంజీవి కృష్ణారావు వెంటనే, 'నేను వేయిస్తాను' అని, వ్యవధి తక్కువైనా, చక్కగా వేయించారు. అచ్చు పనిలో శ్రీ A.S. దివాకర్‌గారి శ్రమా మరిచిపోలేనిదే.

శ్రీశ్రీశ్రీ స్వామి అనుభవానందులు 'శ్రీ శారదా రామకృష్ణ సంఘం' భీమునిపట్నంలో స్థాపించారు. అక్కడే శ్రీ మాతాజీవారు కూడా వారి వద్దనే వుండే వారు. మాతాజీవారు సన్యాసాశ్రమం ప్రవేశించేప్పు

డు, నేను కూడా వారితో కలకత్తా వెళ్లి చూసే భాగ్యం కలిగింది. నిజంగా అమ్మ 'విలువ' ఏమిటో అప్పటి వరకు నాకు తెలియదు. అమ్మను ఎట్లా గౌరవించాలి అనేది చెప్పకుండానే నాలో వారు కల్గించారు. అది కాకుండా నాలో చాలా మార్పుని తీసుకు వచ్చి, నన్నొక మనిషిగా తీర్చారు.

మాతృస్వరూపిణీ, ప్రేమ స్వరూపిణీ, దైవ స్వరూపిణీ అయిన మా అమ్మకు నమస్కరిస్తూ, మా స్వామిజీ శ్రీశ్రీశ్రీ స్వామి అనుభవానందులవారి పాదపద్మాలకు ఈ కృషి సమర్పించుకుంటున్నాను.

పి.వి.రమణయ్య రాజా.

# శ్రీమాత పాదపద్మారాధనలో....

ఆశ్వయుజమాసంలో దేవీ నవరాత్రులు వచ్చాయి. ఆశ్రమంలో పూజలు, పారాయణలు, శ్రీ లలితా సహస్రనామ ప్రవచనములు జరుగుతున్నాయి. ఆ సమయంలో 'అమ్మా! నాకు పుస్తకం వ్రాసి యిస్తారు కదూ!' అంటూ వచ్చింది ఉత్తరం చి॥రాజానుండి.

ఆశ్వయుజమాసంలో – శుద్ధపాడ్యమినుండి ప్రారంభం దేవీ పూజలు. అవి శక్తిసంబంధం. అట్లతదియ ఆడపిల్లల పండగ. అది కూడా అంతే! ఆపై లోకకంటకుడైన నరకుని సంహరించటానికి శ్రీకృష్ణునితో పాటు బయలుదేరిన సత్యభామ అపర శక్తియై విజృంభించిన నరకచతుర్దశి కూడా శక్తి విశిష్టతనే చాటుతున్నది. శరత్కాలమేఘాలు మెల్ల మెల్లగా పరుగులు వేస్తుంటే చందమామ దోబూచు లాడుతున్నది. ఆ చందమామ జగన్మాతయై, మేఘములవంటి తన బిడ్డలతో ఆడుకుంటున్నట్లు తోచింది. ఆశ్వయుజమాసంలో శక్తికి ప్రాధాన్యత కదా! మరి బిడ్డకు ప్రథమ సంబంధం తల్లితోనే కదా! శ్రీ లలితా సహస్రనామంలో మొదటి నామం 'శ్రీమాత్రేనమః' అని ఆ జగజ్జనని తోనే ఆరంభ మైంది కదా! అన్నీ కలిసి 'శ్రీమాత' గా మనస్సులో ఒక భావన కదిలింది. అంతే! కేవలం పది దినాల లోనే నా యితర కార్యక్రమాలతో పాటు యీ చిన్న గ్రంథం కూడా రూపొందింది.

ఈ గ్రంథంలో శక్తిని గురించి కొద్దిగా పరిచయం మాత్రమే చేయగలిగాను. అసలు శక్తిని గూర్చి అనేక ముఖ్యగ్రంథాలు, ఉపనిషత్తులు, శాక్తరహస్యాలు, శాక్తేయంలోని అతి ప్రధానమైన వివరణలుగాని యిందులో వ్రాయలేదు. ఇక ముందు రానున్న 'శక్తి

పూజావిశిష్టత', 'మంత్రశాస్త్రము', 'తంత్రశాస్త్రము', శ్రీ చక్రరహస్య విజ్ఞానము' అనుగ్రంథములలో అధిక వివరణల నందించటానికి ప్రయత్నిస్తాను.

'శక్తిమయమిదం జగత్' అన్నట్లు ప్రపంచమంతా శక్తిమయమే. ప్రతి వ్యక్తి శాక్తేయుడే. ప్రతి మతంలో యీ శాక్తేయం అంతర్గతమే. సర్వవ్యాపమైన ఆశక్తి లేనిదే ఏ కార్యములు కూడా జరగవని చెప్పవచ్చును. అందువలన ప్రతి మానవునికి శ్రీ మాత పాదార్చన తప్ప వేరే మార్గం లేదు. ఇది ముమ్మాటికి సత్యం.

మూడు దశాబ్దాలకు పైగా మా గురువర్యులైన శ్రీ అనుభవానంద స్వామివారితో,నాతో పరిచయం కలిగి, శ్రీ స్వామిజీ అభిమానాన్ని అనుగ్రహాన్ని పొందిన భాగ్యశాలులురు చి॥రాజా-లక్ష్మీ దంపతులు. ధార్మిక, సత్కార్య నిర్వహణలో చి॥రాజాదంపతుల జీవితం ధన్యం కావాలని, ఆశిస్తూ, శ్రీమాత వీరికి యితోధి కంగా భక్తి జ్ఞాన ఆయురారోగ్యైశ్వర్యాదుల ననుగ్ర హించాలని కాంక్షిస్తూ, నా హృదయపూర్వక ప్రేమా శీస్సులు కూడా అందిస్తున్నాను.

ప్రమోద, దీపావళి
భీమునిపట్నం
మాతాజీ త్యాగీశానంద
18.10.90

ఓం

# శ్రీమాత

## శ్రీ శారదాదేవ్యై నమః

శ్లో॥ యాదేవీ సర్వ భూతేషు మాతృరూపేణ సంస్థితా।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః॥

శ్లో॥ శరణాగతదీనార్త పరిత్రాణపరాయణే।
సర్వస్యార్తిహరే దేవి నారాయణి నమోऽస్తుతే!!

శ్లో॥ విద్యావంతం యశస్వంతం లక్ష్మీవంతం జనం కురు।
రూపం దేహి జయం దేహి యశోదేహి ద్విషో జహి॥

'దివా పశ్యతి నోలూకః కాకో నక్తం న పశ్యతి।
విద్యావిహీనో మూఢస్తు దివా నక్తం న పశ్యతి॥'
గుడ్లగూబ పగలు చూడలేదు. కాకి రాత్రి చూడలేదు. విద్యావిహీనుడైన మూఢుడు రాత్రింబవళ్లు చూడ లేడని అర్థం. అసలు విద్య అంటే ఏమిటి? హృదయ శాంతికి సంఘశాంతికి ఏది కారణమో అది విద్య. అయితే విద్యవలననే అన్నీ సిద్ధిస్తాయా? అటువంటి విద్యఏది? 'ద్వే విద్యే వేదితవ్యే పరా చైవాపరా చ' అని పర, అపరములుగా ద్వివిధం. అందులో అపర విద్య వలన లౌకిక సుఖాలు లభిస్తాయి. ఆధ్యాత్మికవిద్య అయిన పరా విద్య వలన జన్మరాహిత్యం కలుగుతుంది. అందుచేతనే 'సర్వేషాం విద్యానాం హృదయమేకాయనం' సకల విద్యలకు హృదయమే నిలయమని బృహదారణ్యకోపనిషద్వాక్యం. విద్యతో హృదయ వికాసం కలగాలి. మానసిక వికారాలు

నశించాలి. వివేకాన్ని అందుకోవాలి. సత్సంస్కారం జనించాలి. ఆ సుసంస్కారంతోనే అజరామరమైన యశస్సు లభించాలి. విద్య లేకున్నా సంస్కారం ఉండవచ్చును. సంస్కారం లేకున్నా విద్య ఉండవచ్చును. కాని విద్య సంస్కారం కలిసిమెలిసి ఉంటే అందమైన పుష్పానికి సుగంధం తోడైనట్లుగా ఆనందం ప్రవహించి, లోకశాంతికి కారణం అవుతుంది.

ఇక నేటి ప్రపంచంలో విద్య ఉన్నది కాని సంస్కారమే లోపించిందనవచ్చును. విద్య కేవలం ఉద్యోగార్థం కావటంచేత సత్ఫలితాన్ని అందించలేకపోతున్నది. ఆందోళన కలిగిస్తున్నది. ఈనాటి ప్రపంచ పరిస్థితిని చూచినా, ఆలోచించినా భయం ఆవరిస్తున్నది. దీనికి కారణమేమిటి? మానవుడు మానవుడుగా, యజమాని యజమానిగా, ఉపాధ్యాయుడు ఉపాధ్యాయుడిగా, విద్యార్థి విద్యార్థిగా ఉండకపోవడమే. తల్లి బిడ్డలకు, అన్న దమ్ములకు, భార్యాభర్తలకు, యజమాని సేవకులకు, విద్యార్థి ఉపాధ్యాయులకు, గురు శిష్యులకు, నాయకులకు ప్రజలకు మధ్య అవగాహన లోపించి, పవిత్ర సంబంధం దూరం అయింది. స్వార్థం పెరిగిపోయింది. హింసాప్రవృత్తి, వంచన, అక్రమ ధనసంపాదన, బాధ్యతారాహిత్యం, అవిధేయత, రాక్షసత్వం, లౌకిక సుఖాలకై తపన, క్రమశిక్షణ పాటించకుండటం, ఎప్పుడు, ఎక్కడ, ఎవరితో, ఏవిధంగా ప్రవర్తించాలో తెలియకపోవడం, మన సంస్కృతిని విస్మరించటం, విమర్శించటం, విదేశ సంస్కృతీ వ్యామోహం, అనుసరణ, చిన్న పెద్ద తారతమ్యం లేకుండటం, దయాదాక్షిణ్యాది కమీన మానవ లక్షణాలు మరుగున పడటం, ఎదిరించటం, భయభక్తులు అంతర్ధానంకావటం, వ్యసనపరుడవటం, శీలరక్షణ లేకుండటం వంటి అవలక్షణాలు బాగా పెరిగి, మానవునిలో అశాంతిని, అలజడిని కలిగిస్తున్నవి. ఇవి పెరిగి పెరిగి,

మానవుని ద్వారా సంఘంలో ప్రవేశించి, లోకాన్ని ప్రమాదంలో ముంచుతున్నవి. జీవితమనే వృక్షాన్ని సుందర సుమాలతో, సుమధుర ఫలాలతో నింపుకొన వలసిన మానవుడు ముళ్లచెట్టులాగ తయారై, సంఘానికి హాని కలిగిస్తున్నాడు. ముళ్లచెట్టు దానంతటది అది వచ్చి ఎవరికి గుచ్చుకోదు. కాని ముళ్లవంటి భావాలతో నున్న మనిషి మాత్రం అందరిలో తిరుగుతూ, అందరికీ అపకారం చేస్తున్నాడు? ఈ విధంగా సంఘాన్ని బాధించేవారిని ఏమనాలి? ఇది విద్యా ఫలితమా? లేక అవిద్యా ఫలితమా? తాత్కాలికంగా పోట్లాడుకున్న పశువులు మరల కలిసి మెలిసి జీవించగలుగుతున్నవి కాని యీ మనుములు మాత్రం జీవితాంతం కక్షతో సాధించటమే కాక తన యీర్ష్యాసూయల్ని, కోపతాపాలను తన సంతానానికి కూడా అందిస్తున్నాడంటే ఏమనాలి? ఉన్నత మనస్సుతో, ఉన్నత భావాలతో, ఉత్తమ శీలంతో, ఉన్నత ఆదర్శంతో, ఉత్తమ శీలసంపదతో, ఉత్తమ ప్రవర్తనతో, ఉన్నతానుభవ సంపద్విభూషితులైన ఉత్తమ గురువర్యుల నాశ్రయించి, ఉత్తమ శిష్యులై, ఉత్తమ సత్సాంగత్యంతో ఔన్నత్యమును పొంది, ఉత్తమ తపస్సుచే ఉన్నతాధ్యాత్మిక జీవితశిఖరాల నధిరోహించి, ఉత్తమ సంస్కృతికి వారసులై, జగద్వంద్యులై, 'సర్వే జనా స్సుఖినోభవంతు' అనియు, 'గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం' మానవులకేగాక, మానవుల శరీరారోగ్యానికి ఉపయోగించు పాలు, నెయ్యి, వెన్నలను అందిస్తున్న పశువుల నుండి, మానవులకు హృదయశాంతిని ప్రసాదించు బ్రహ్మజ్ఞాన సంపన్నులవరకు అందరికి సుఖశాంతులు లభించాలనియు, మరి యీ లోక వాసులేకాక 'లోకా స్సమస్తా స్సుఖినోభవంతు' సర్వ లోకములును సుఖంగా ఉండాలని భావించిన మన విశాల భారతీయ సంస్కృతీసంప్రదాయమేమైనది?

ఈ స్వార్థపూరితమైన సంకుచితత్త్వం ఎక్కడనుండి వచ్చింది? 'విద్యా దదాతి వినయం' విద్య వలన వినయం కలుగకపోగా, 'విద్యా వివాదాయ ధనం మదాయ' విద్య వివాదముకొరకు, ధనం మదంకోసం అనే దానవ సంప్రదాయానికి ఎందుకు లొంగవలసి వచ్చింది? అత్యున్నతాదర్శంతో, ఆధ్యాత్మిక గురు పీఠాన్నలంకరించి, అందరికి ఆధ్యాత్మిక విజ్ఞాన భిక్షను అందించిన మన దేశం యీవిధంగా ఎందుకు దిగజారింది? దీనికి కారణం ఏమిటి? 'యమం' అనే యింద్రియనిగ్రహంలేక మయసభ లోవలె యీలోకంలో సంచరిస్తున్నారు. 'దమం' అనే బాహ్యేంద్రియ నిరోధంలేక మదం పెరిగిపో తున్నది. గురుకులాల్లో, ప్రశాంత వాతావరణంలో, నిర్మల నదీతీరంలో నివసిస్తూ, లోకశ్రేయస్సుకు యజ్ఞయాగాదుల నిర్వహిస్తూ, తాము నేర్చిన విద్యను నిష్కాములై విద్యార్థులకు బోధిస్తూ, జప తపాదులగా విస్తూ, లౌకికాధ్యాత్మిక జీవిత సమన్వయం గావించిన నాటి గురు వరేణ్యులంతర్ధానమయ్యారు. గురువులుపోగా కులాలు మిగిలిపోయాయేమో! ఏ గుణాలవల్ల మానవ హృదయ క్షేత్రంలో పుష్కలంగా శాంతి ప్రకాశిస్తుందో, ఏ కృషివల్ల భూమి సస్య శ్యామలం కాగలదో గ్రహించి, సామాన్య మానవుల నుండి ముముక్షువుల వరకు వలయు సర్వసద్గుణాలను మనకు అందించాయి శాస్త్రాలు. భూగోళ, ఖగోళ, జ్యోతిష, వైద్య, వైమానిక, సంగీత, సాహిత్య నృత్య శిల్ప, చిత్రలేఖనాది సకలకళల బోధించి, వివరించి, ఆ కళలలో భగవంతుని దర్శించి, సర్వకళా స్వరూపుడైన ఆ భగవానునికి ఆ కళలర్పించి, షోడశకళాప్రపూర్ణుడైన చంద్రునివలె ప్రకాశించమని ఆదేశించింది మనవేదం. తల్లి తన బిడ్డలకు చిన్ని చిన్ని కథలు చెప్తూతూ, గోరుముద్దలు తినిపిస్తూ, వారికి మానసిక, శారీరక బలాలను చేకూర్చినట్లు మన

వేదమాతకూడా అపమార్గానబడి, సంచరిస్తున్న వారి నుద్ధరించడానికి, కథలరూపంలో, ప్రశ్నోత్తరాలరూపంలో, గురుశిష్య సంవాదరూపంలో అనేక సద్విషయాలను మానవుల మనస్సుకు హత్తుకొనేటట్లు చక్కగా బోధించింది.

ఒకసారి దేవ, దానవ, మానవులందరూ ఒకచోట సమావేశ మయ్యారు. అనేక విషయాలపై చర్చలు సాగిస్తున్నారు. ఎవరికి వారు మా అంతవారు లేరని భావిస్తున్నారు. వారి వారి అవలక్షణాలను వారికి తెలిపి, వారిని సన్మార్గులను చేయాలనే సంకల్పం కలిగింది భగవంతుడికి. భగవానుడంటే సర్వజ్ఞుడుగదా! 'ఉత్పత్తిం ప్రళయం చైవ, భూతానామాగతింగతిం, వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి' ఉత్పత్తి ప్రళయాలను, భూతముల గమనాగమన ములను, విద్యావిద్యలను గ్రహించినవాడు భగవంతుడని వాయుపురాణ నిర్వచనం. ఆ సర్వ వ్యాపకత్వాన్ని సూచించే ఆకాశం నుండి ఒక శబ్దం ఆవిర్భవించింది. అదే ఉరుము. ఆ ఉరుము 'ద,ద,ద' అని గర్జించింది. ఆ శబ్దాన్ని అక్కడున్న వారందరూ ఆలకించారు. అనుకోనట్లు వారిలో ఏదో హృదయ స్పందన ఏర్పడింది. అంతరంగంలో అలజడి రేగింది. ఆలోచనలు రేకెత్తాయి. ఆశ్చర్యంతో ఒకరినొకరు చూస్తున్నారు. అంతటా నిశ్శబ్దం తాండ విస్తున్నది. ఏదో ప్రశాంతత ఆవరించినట్లున్నది. అందరూ వారి వారి ఆలోచనాస్రవంతిలో లీనం అయినట్లుగా ఉన్నారు.

అటువంటి సమయంలో దేవతలరాజు లేచి నిలిచాడు. దేవతలారా! మనమంతా ఆ శబ్దాన్ని విన్నాముకదా! ఆ ఉరుములోని శబ్దం 'ద,ద,ద' అంటున్నట్లు నాకు అనిపించింది. దీని అర్థం ఏమిటి? మనందరం మానవులకంటె అధికులమని భావిస్తున్నాము. అహంకరిస్తున్నాముకూడా. భూలోకం

నుండి యజ్ఞయాగాదులద్వారా మన స్వర్గానికి వచ్చిన మానవుల చూచి గర్విస్తున్నాము. అయితే మనకు మంచి లక్షణాలతోపాటు చెడుగుణాలుకూడా ఉన్నవి. మన స్వర్గలోకంలో అనేకమంది అప్సరసలున్నా మన మనస్సు చలిస్తుంటుంది. భూలోకంలోనున్న సౌందర్యవతులైన మానవ కాంతలకై పరుగులు తీస్తుంది. 'న పరదారాం గచ్ఛేత్' పరస్త్రీనిగూర్చి వెళ్లవద్దనే శాస్త్రవాక్యం తెలిసినా, చిత్తచాంచల్యంవల్ల శాస్త్రప్రబోధను మరచి, ఒళ్లుమరచి, వారికోసం వెళ్లి శాపాలను పొందుతుంటాము. ఎన్ని మంచిలక్షణాలున్నా అభివృద్ధి శూన్యమే. జీవితవికాసానికి శీలం అతి ప్రధానమైనది. జితేంద్రి యుడైన మహనీయునికి సర్వప్రపంచం పాదాక్రాంతం అవుతుంది. వారి ఆ జితేంద్రియత్వం లోకాన్ని శాసిస్తుంది, ప్రకాశింపజేస్తుంది. కాని మనకు లేనిది ఆ యింద్రియ నిగ్రహమే. కాబట్టి 'దమేతి, దమేతి, దమేతి' అని, ఇంద్రియ నిగ్రహం కలిగి ఉండమని యీ ఉరుములు మనకు ఒక సందేశాన్ని అందిస్తున్నట్లు నాకు స్ఫురిస్తున్నది.' అని వివరించాడు. దేవతలందరూతమ యింద్రియ చాపల్యానికి చింతించారు.

తర్వాత దానవుల మధ్యనుండి దానవరాజుకూడా లేచాడు. 'దానవులారా! మనం దేవతలతో సరియైన శక్తిసామర్థ్యాలు కలవాళ్లం. వారితో పాటు ఉగ్ర తపస్సులు చేశాము. భగవానుని మెప్పించాము. ప్రత్యక్షం చేసుకున్నాము. అనేక వరాలను ఆర్జించాము. ఆ వరముల అహంకారంతో, అధికారదాహంతో అనేకమందిని బాధించాము. మహర్షులను, మహాత్ములను హింసించాము. మంచివారిని అనేక బాధలకు గురి చేశాము. వర గర్వం ఏది చేయాలో, ఏది చేయరాదో అనే విచక్షణాజ్ఞానాన్ని నశింపజేసింది. అందుచేత క్రూరత్వం అధికం అయింది. మన శక్తులన్నీ దుర్వినియోగం అయ్యాయి. మన శక్తుల్ని

సద్వినియోగం చేసుకుంటే లోకశ్రేయస్సుకు, దుర్విని యోగం చేస్తే ప్రపంచ నాశనానికి ఉపయోగిస్తాయి అనే రహస్యాన్ని గ్రహించలేకపోయాము. దేవతలు మంచివారని, మనమంతా రాక్షసులమని పేరు పొందాము కాన మనకు కావలసినది దయ. మనకు దయలేకుండటం చేత మహానుభావుల దయను మనం పొందలేకపోయాము. 'దయేతి దయేతి దయేతి' అని దయ కలిగిఉండమని యీ ఉరుములు మనకు దివ్య సందేశాన్ని అందిస్తున్నవి' అని వచించి కూర్చున్నాడు.

అంత వెంటనే మానవులలోనుండి ఒక మహారాజు కూడా లేచి యీవిధంగా తన అభిప్రాయాన్ని వివరించాడు. 'మానవులారా! మనం మానవులం. ఈ మానవ జన్మ దేవతలకు దానవులకు మధ్యనున్నది. మనకు కూడా అనేక దివ్య శక్తులున్నవి. తపస్సు చేయగలం. పరలోకసుఖాలను కోరుకుంటాము. ఆ సుఖాలకు యిక్కడ దానధర్మాల నాచరించాలి. 'పుత్రకామేష్టినా పుత్రం, వాణిజ్యాదినా విత్తం, జ్యోతిష్టోమేన స్వర్గం..' పుత్రకామేష్టి చేత పుత్రుని, వాణిజ్యంచేత ధనాన్ని, జ్యోతిష్టోమంచేత స్వర్గం లభిస్తాయని ముక్తికోపనిషత్తు వివరించింది. ఒక్కొక్క దానం వల్ల ఒక్కొక్క ఫలితం కలుగుతుంది. కాబట్టి దానం చేయాలని శాస్త్రోపదేశం. 'పుణ్యస్య ఫలమిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవాః। న పాపఫలమిచ్ఛంతి పాపం కుర్వంతి యత్నతః॥' మానవులు పుణ్యఫలితాన్ని ఆశిస్తారు కాని పుణ్యం చేయరు. పాపఫలానుభవాన్ని వాంఛించరు కాని ప్రయత్నపూర్వకంగా పాపం చేస్తారని మహాత్ముల ప్రబోధ. దానధర్మాల నాచరించి పుణ్యలోకప్రాప్తిని కాంక్షించవలసిన మానవుడు పుట్టినప్పటినుండి ధనసంపాదనకు ప్రాకులాడతాడు. ధనం లేనప్పుడు 'లేదే' అని, ఉంటే ఎవరికైనా 'యివ్వాలేమో' అని, దొంగలు

దోచుకుంటే 'పోయిందే' అని సర్వదా మానవుడు దుఃఖిస్తూనే ఉంటాడు. ఇక దానధర్మాలు ఎప్పుడు చేయాలి? ధనాశ తగ్గాలి. దానేచ్ఛ అభివృద్ధిచెందాలి. మనలో యీలోపాన్ని గ్రహించిన ఆ భగవానుడు మనకు 'దత్తేతి, దత్తేతి, దత్తేతి' అని దానం చెయ్యమని యీ ఉరుములద్వారా ప్రబోధిస్తున్నాడు. ఈ లోపాన్ని సరిజేసుకుని, మానవత్వం పొంది, సర్వ సుఖాలను పొందాలని అభిలషిస్తున్నాను' అని తన మనస్సులోని భావాన్ని బహిర్గతం చేశాడు. ఇది ఉపనిషత్సందేశం అనవచ్చును.

ఈ కథలో చెప్పబడిన యింద్రియనిగ్రహంలేని దేవలక్షణాలు, దయలేని రాక్షస భావాలు, దానధర్మాలు లేని మానవగుణాలు నేటి ప్రపంచంలో ఒక్క మానవునియందే పర్వతతుల్యంగా పెరిగిపోయాయి. శాఖోపశాఖలుగా విస్తరించి, ఊడలు సాగి, బాగా నాటుకుని గట్టిగా తయారయ్యాయి. కుండకు ఒకటి, రెండు రంధ్రాలుంటే మూయగలం కాని, కుండనిండా చిల్లులే అయితే ఏమి చేయగలం? అదేవిధంగా ఒకటి రెండు అవలక్షణాలుంటే పోగొట్టయత్నించగలం కాని అన్ని అవలక్షణాలైతే ఏమి చేయాలి? మానవునిలో గ్రంథజ్ఞానం, పూజలు, వ్రతాలు, యాత్రలు, ఉపన్యాసాలు, భక్తి జ్ఞానములన్నీ ఉన్నట్లున్నా చిల్లి కుండలో నీరు నిలవనట్లుగా యివి హృదయంలో నిలువలేక పోతున్నవి. నీతి, నియమం, శీలం, వినయవిధేయతలు మచ్చుకైనా లేవుగదా! నిర్దయ, కఠినత్వం, క్రూరత్వం, హింసాదులు స్వేచ్ఛగా వీర విహారం చేస్తున్నవిగదా! మానవత్వపు విలువలు మంటగలిపి, సాత్త్విక లక్షణాలు హీనస్థితికి దిగ జారుతున్నవి గదా! ఈ భయంకర పరిస్థితినుండి బయటకు రావటం ఎలాగ? నేటికైనా మన స్థితిని గమనించుకొని, మన మహర్షిగణం మనకందించిన దమ, దయ, దాన గుణ ప్రాముఖ్యతను గ్రహించి,

వాటిని కవచంగా ధరించిననాడు రాక్షసత్వం నశిస్తుంది. మానవత్వం పుష్పిస్తుంది. దైవత్వం ఫలిస్తుంది. బ్రహ్మత్వం సిద్ధిస్తుంది. సందేహంలేదు. కాన మనకు రక్షణ చేసేవారు కావాలి.

ఈ రక్షణ లోకంలో అన్నింటికి ఉన్నది. కనుపాపను కన్ను రక్షిస్తుంది. కాళ్లకు రక్షణ పాదరక్షలు. ఎండ, వానలకు రక్షణ గొడుగు. శీత బాధలకు రక్షణ వస్త్రములు. బిడ్డకు రక్షణ తల్లి. లోకానికి రక్షణ జగజ్జనని. ఇన్ని రక్షణలున్న మానవుడు తన మనస్సుకు రక్షణ కలిగించుకోలేకపోతున్నాడు. పసితనం నుండి తన శరీరాన్ని పోషించి, తనను ఆదుకున్న తల్లి రక్షణ మొదటిది. ఆ రక్షణ లేకున్న మానవ జీవితానికి మనుగడయే లేదనాలి. కాని నేడు తమ తల్లిదండ్రులను ఎంతమంది సంరక్షిస్తున్నారు? ఆ బాధ్యత తమకున్నదని ఎంతమంది గ్రహిస్తున్నారు? 'మాతృదేవో భవ' అని వేదికలపై ఉపన్యాసాలలో, గ్రంథ రచనలలో ప్రేమగౌరవాలు పొంగి ప్రవహిస్తున్నవి కాని నిజ జీవితంలో వాటికి స్థానం లేదని అందరికి తెలుసు. పాడి లేని ఆవును, పని చేయలేని ఎద్దును, పరిగెత్తలేని గుఱ్ఱాన్ని బయటకు త్రోసినట్లు దయా దాక్షిణ్య రహితులై, వృద్ధులైన తల్లిదండ్రులను వదలివేస్తున్నారు. తమ బాల్యంలో ఆ తల్లిదండ్రులే తమను కంటికి రెప్పలాగ సంరక్షించి, పెంచి, విద్యాబుద్ధుల నేర్పించకున్న నేటి తమ స్థితి ఏమిటి అనే ఆలోచన వీరికిరాదా? ఇది ప్రగతి పథమా? అసలు మనం ఎటు ప్రయాణం సాగిస్తున్నాం? పశుత్వానికా? లేక దానవత్వానికా? మానవత్వంతో మాధవత్వాన్ని అందుకోవలసిన మానవునకు ఎందుకీ విపరీత స్థితి? ఆదరణలేని ఆ వృద్ధులు ఎంత వ్యథ చెందుతున్నారో కదా?

విద్యలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడైన భారతీయు డొకడు విదేశములలో ఉన్నతోద్యోగి అయ్యాడు. 6 నెలలు శలవు పెట్టి, తన పెద్ద కొడుకుతో భారతదేశం వచ్చాడు. తల్లిదండ్రులను చూచాడు. మంచి స్థలం కొన్నాడు. ఆధునిక వసతులతో చక్కని భవనాన్ని నిర్మింపజేశాడు. దానికి 'వృద్ధాశ్రమం' అని పేరు పెట్టాడు. ప్రారంభోత్సవానికి పెద్దల నాహ్వానించాడు. అందరూ ఆయన ధార్మిక గుణాన్ని పొగిడారు. ప్రారంభోపన్యాసంలో వివరాలను తెలియజేశాడు యీ ఆశ్రమ నిర్మాత. తర్వాత 'సోదరులారా! అధిక ధనం ఖర్చుపెట్టి, అన్ని వసతులు ఏర్పాటు చేశాను. ఈ భవన నిర్మాణం నా ధనత్యాగంతో ప్రారంభమైనదన్న విషయం మీఅందరికి తెలుసు. ఇంకొక త్యాగంకూడా చేస్తున్నాను. మొదటగా వృద్ధులైన మా అమ్మా నాన్నలనే యిందులో చేరుస్తున్నాను. ఇక నేను మాత్రం అమెరికా వెళ్లుతాను' అంటూ వినయంగా అందరికి నమస్కరించాడు. ఇకముందు తమ సంతానం కూడా తమను యిక్కడే ఉంచుతారనే విషయాన్ని విస్మరించిన సభికుల కరతాళ ధ్వనులు ఆకాశా న్నంటాయి. ఈ సంఘసేవ చేయటానికని అమెరికా నుండి వచ్చిన తమసుపుత్రుని మాటలకు ఆవృద్ధ తల్లిదండ్రులు ఆవేదనతో ఒకరి ముఖం ఒకరు చూచుకున్నారు పాపం. వెంటనే ఆ వృద్ధదంపతుల మనవడు లేచి, వచ్చీరాని తెలుగులో 'మానాన్నను, కాదు డాడీని కూడా తర్వాత యిక్కడే చేరుస్తాను' అన్నాడట. ఈ విధంగా మానవుల బుద్ధి వెర్రితలలు వేస్తున్నది. మేధాశక్తి మానవునికి పెరిగి దేశసంక్షోభాన్ని కలిగిస్తున్నది. సుఖాలు అధికమవుతున్నవి. అంతకు మించి దుఃఖాలు పెరిగాయి. మేధాశక్తి విజృంభిస్తున్నది. హృదయం ముకుళించుకు పోతున్నది. మనో విజ్ఞానం నాశనానికి దారితీయ కుండా కాపాడేది భౌతికవిజ్ఞానం అభివృద్ధి చెంది,

ఆధ్యాత్మ విజ్ఞానం లోపించటం వల్లనే మానవునికి యీ సమస్యలు. ఈ ఉన్నదా? ఉన్నది. పెద్దలు చెప్పిన పరిష్కారమార్గాలను గ్రహించి; తన తెలి వితేటలను కూడా కలిపి ఆలోచించుకుని సరిజేసు కోవాలి. 'యస్య నాస్తి స్వయం ప్రజ్ఞా శాస్త్రం తస్య కరోతికిం। లోచనాభ్యాం విహీనస్య దర్పణః కిం కరిష్యతి॥' గ్రుడ్డి వానికి దర్పణం ఉపయోగం లేనట్లే స్వయం ప్రజ్ఞలేని వానికి శాస్త్రంమాత్రం ఏం చేయగలదను ప్రశ్నలోనే సమాధానంకూడా ఉన్నది. శాస్త్రం చెప్తుతుంది. చెప్పినట్లు చేయవలసిన బాధ్యత మానవులదే. యజమాని యజమానిగా గురువు గురువుగా శిష్యుడు శిష్యుడుగా, విద్యార్థి విద్యార్థిగా, ఉపాధ్యాయుడు ఉపాధ్యాయుడుగా, సేవ కుడు సేవకుడిగా తమ తమ బాధ్యతలను నిర్వహింప కుండుటయే యీ సర్వానర్థాలకు మూల కారణం.

భగవత్సృష్టిలో ఒక క్రమపద్ధతి వ్యక్తం అవుతుంది. సకాలానికి సూర్యచంద్రుల ఉదయాస్త మానములు జరుగుతున్నవి. ఆయా కాలాలలో ఆ యా పుష్పాలు, ఆయా కాలాలలో కాయలు పండ్లుగా మారుతూ మానవులకు ఉపయోగపడుతున్నవి. మానవుడు యీ ప్రకృతిని చూచి తన జీవితాన్ని క్రమబద్ధం చేసుకోవాలి. కాని పెద్దల మాటలను వినక, క్రమశిక్షణా రహితుడైన మానవుడుమాత్రం ప్రపంచానికి మంచిగా ఉపయోగపడకున్నా, అర్థంలేని స్వేచ్ఛాచారంతో, ప్రకృతి విరుద్ధ కార్యాల నాచరించి, తాను బాధచెంది, లోకాన్ని బాధిస్తున్నాడు. ఇటువంటి వారే లోకకంటకు లనబడ్డారు పూర్వం. వీరి బాధలు అధికం అయినప్పుడు, బిడ్డ తప్పు చేస్తే తల్లి శిక్షించినట్లు ఆ జగదంబ అవతరిస్తుంది. మరి జగద్రక్షణ బాధ్యత ఆమెదేకదా! ఆ తల్లి తన బాధ్యతల నేనాడు విస్మరించలేదు. అందుచేత

దుష్ట శిక్షణ చేస్తుంది. శిష్టరక్షణ గావిస్తుంది. సత్పురుషులను కాపాడుతుంది. భక్తుల ప్రార్థనల నాలకిస్తుంది. తనను మాతృమూర్తిగా నారాధించినవారిని వాత్సల్యంతో తన ఒడిలోకి తీసుకుంటుంది. వారి యోగక్షేమాలను ఆమే చూచుకుంటుంది. ప్రేమామృతాన్ని వర్షిస్తుంది. ఆనందాన్ని ప్రసాదిస్తుంది. జన్మరాహిత్యస్థితిని అనుగ్రహిస్తుంది. ఆమె తన బాధ్యతలను సక్రమంగా, నిర్విఘ్నంగా కొనసాగిస్తుంది. ఆమెయే శ్రీమాత! ఆ అకళంకమూర్తి ఆరాధనే మనకు కలిమిని, బలాన్ని కలిగిస్తాయి. 'శక్తిజ్ఞానం వినా దేవి నిర్వాణం నోపలభ్యతే' శక్తి జ్ఞానంవినా నిర్వాణస్థితి అలభ్యమని శక్తివిశిష్టతను చాటి చెప్పింది మహానిర్వాణతంత్రం. ఆ శక్తి కృపాకటాక్షం వల్లనే సకల సద్గుణ సముదాయం మానవుని చేరతాయి. అశాంతి పటాపంచలై శాంతి చేకూరుతుంది. అంతా శాంతి శాంతి. ఆ శక్తియే శారీరక శక్తియై, ఆయుధ శక్తియై, తామసిక శక్తియై, రాజసిక శక్తియై, సాత్విక శక్తియై, మానసిక శక్తియై, ఆధిభౌతిక శక్తియై, ఆధ్యాత్మిక శక్తియై 'యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా' అని సర్వశక్తిగా కీర్తింపబడ్డది సప్తశతీ గ్రంథంలో. ఆశక్తియే జగద్ధాత్రి! ఆమెయే జగదంబ! ఆమెయే ఆద్యశక్తి! ఆమెయే పరాశక్తి! ప్రపంచంలో ప్రతివ్యక్తి ఆ పరాశక్తికి, ఆ పరాత్పరికి చేతులెత్తి నమస్కరించవలసినదే! శక్తి లేనివాడు లోకంలో లేనేలేడుగదా!

మానవజీవితం అనిత్యం, అసత్యం, అశాశ్వతం. కాని యీ నశ్వర శరీరంలో అంతర్గతమై, చేతనమై, అణురూపంలో ఉండే ఆ అద్భుత శక్తి సర్వవ్యాపకమై, మహత్తులతో మహత్తై నిత్యమై, సత్యమై, శాశ్వతమై ప్రకాశిస్తున్నది. ఈ మాటను 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అని ఉపనిషత్తులు చక్కగా బోధించాయి. ఈ శక్తికే విలువ కాని యీ దేహానికి విలువలేదు. రథంలో దేవుడుంటేనే రథానికి విలువ.

అదేవిధంగా యీ దేహం అనే రథంలో ఆ దివ్య శక్తి నివసిస్తేనే విలువ. శిక్షణలేని అశ్వములవలన రథానికి ప్రమాదం సంభవించినట్లే యీ దేహమనే రథానికి కట్టిన నిగ్రహంలేని యింద్రియాలనే గుఱ్ఱముల వలన మానవుడికికూడా ప్రమాధం కలుగుతుంది. మరి అనిత్యంలో నిత్యంగా, లౌకికంలో అలౌకికంగా, అసత్యంలో సత్యంగా, శబ్దంలో నిశ్శబ్దంగా, అశాంతిలో శాంతిగా, అశాశ్వతంలో శాశ్వతంగా, అజ్ఞానులలో విజ్ఞానిగా జీవించాలంటే ఎవరిని ఆశ్రయించాలి? ఏవిద్యను పొందాలి? ఇంద్రియాతీతమై, అగ్రాహ్యామై, అనుభవైకవేద్యమై, ఆనంద నిలయమైన అద్భుతశక్తిని ఆశ్రయించక తప్పదు, పరావిద్యను పొందక తప్పదు. ఆ అనిర్వచనీయ శక్తిని, పురుమనిగా గాని, స్త్రీ రూపమునగాని భావించుట మానవుని మానసిక శక్తిపై ఆధారపడి ఉంటుంది.

సాధారణంగా ప్రతి జీవికి సంబంధం ప్రథమంగా తల్లితో ఉంటుంది. తండ్రికంటె తల్లిని అధికంగా ప్రేమిస్తారు. కారణం హృదయప్రాధాన్యత కలిగినది స్త్రీరూపం. అందువలననే శ్రీరాముని ప్రార్థించి ప్రార్థించి విసిగిన భక్తరామదాసు 'నను బ్రోవమని చెప్పవే సీతమ్మతల్లీ' అంటూ కరుణామూర్తియు, జనకమహారాజు ప్రియపుత్రియగు జానకీమాతతో మొరబెట్టు కున్నాడు. అదేవిధంగా దాశరధిని కీర్తించి, తన కీర్తనలతో అలరింపజేసి 'సీతమ్మ మాయమ్మ.' అంటూ ఆ సీతామహాసాధ్విని 'మాయమ్మ' అని చేరువ అయ్యాడు, త్యాగరాజస్వామి. కాల స్వరూపిణియై, బాహ్యానికి భయంకరమూర్తిగా దోచు కాళికాదేవిని ప్రేమనిలయగా భావించి 'అమ్మా! ఒక్కసారి నీ దర్శన భాగ్యాన్ని నాకు కలిగించు. నాకు కావలసినది నీవే! నిన్ను వదలి ఉండలేను. నాతల్లివి నీవే! నీ బిడ్డను నేనే, రాఅమ్మా' అంటూ

ఆవేదనా సంభరిత హృదయంతో ప్రార్థించాడు. 'అమ్మా' అంటూ ఆమెను తన ప్రేమతో కట్టివేశాడు. బంధింపబడ్డది ఆ లోకమాత. మాతృహృదయంలో ప్రేమనిండి నిబిడీకృతమై ఉంటుంది. ఆప్రేమను పూర్తిగా ఆస్వాదించినవాడు శ్రీరామకృష్ణ పరమహంస దేవుడు. 'అమ్మా' అని నోరార అనటంలో ఉన్న మాధుర్యం, ఆనందం యింకొక మాటలో రాదేమో, లేదేమో అనిపిస్తుంది. కాని యీనాడు 'అమ్మా' అని పిలిచేవారు లేరు. ఒకవేళ 'అమ్మా' అని పిలిచినా ఆపిలుపు సంస్కారరహితంగా కనిపిస్తున్నది. నేడు 'మమ్మీ' పిలుపుతో అంతా మమ్మీమయంగా ఉన్నది. 'ఓం నమశ్శివాయ' అని అక్షరాభ్యాసకాలం నాటి విద్యను మరచిపోతున్నామేమో! మన విద్యను, సంస్కృతిని విడువకుండ అనేక విద్యలను, సంస్కృతులను గ్రహించటం మంచిది.

మనస్సు విద్యయందలి వివేకాన్ని బహిర్గతం చేస్తే, హృదయం ఆచరణలోని ఆనందాన్ని అందిస్తుంది. ఈ మనోహృదయ సమ్మేళనమే మానవ జీవిత ధ్యేయం. ఈ రెండింటి కలయిక మానవ జీవితానికి ఒక పుష్టిని, తుష్టిని కలిగిస్తుంది. ఆ మనస్సు శివుడైతే, ఆ హృదయం పార్వతిగా మారింది. ఆ మనస్సు నారాయణుడైతే, ఆ హృదయం నారాయణిగా పరిణమించింది. అమనస్సు బ్రహ్మ అయితే, ఆ హృదయం సరస్వతిగా మార్పునొందినది. విద్య అనుభవంతో ఏకీభూతం కావాలి. విద్య మనస్సుది. అనుభవం హృదయానిది. ఇదే అర్ధనారీశ్వరతత్త్వం. ఈ మనోహృదయముల కలయికతో అర్ధనారీశ్వరత్వం సిద్ధించాలి. అప్పుడు లోకానికి యదార్థ ఆనందం కలుగుతుంది. దీని పర్యవసానం మనస్సుకంటె హృదయం సున్నితమై, సౌమ్యమై, ఆకర్షణ కలిగి ఉంటుందని అర్థం. అందుచేతనే ఆదివ్య శక్తిని పురుషదైవంగా కొందరు, స్త్రీదైవంగా

కొందరు అర్చించారు. ఆపురుషమూర్తిని జగత్పిత గా, ఆస్త్రీదైవాన్ని జగన్మాతగా భావించారు కొందరు. ఆ జగత్పితను శివునిగా భావించి శైవులయ్యారు. మరికొంతమంది విష్ణువుగా ఎంచి వైష్ణవులయ్యారు. ఇంకాకొందరు గణపతిగా నిర్ణయించి గాణాపత్యుల య్యారు. శక్తిగా తిలకించి శాక్తేయు లయ్యారు. ఆమెయే సర్వభూతాంతర్గత శక్తియై, సకల దేవ తాంతర్గత మూర్తియై, సర్వ సృష్టి స్థితిలయకారిణియై, జగద్ధాత్రియై, భక్తుల హృదయాధిష్ఠాన దేవతయై, ముక్తి ప్రదాత్రియై, 'యథా యథోపాసతే తదేవ భవతి' అను రీతి అనేక రూపముల నొంది, అనేక విధముల భక్తులరక్షించి, శక్తి పూజకు ఆలవాల మైనది. ఆశక్తియే శ్రీమాత.

ఆ తల్లి త్రిగుణముల ధరించి త్రిగు ణాత్మిక అయినది భక్త రక్షణార్థం. మరియు త్రిగుణయుతుడైన మానవుని సాధనకూడా త్రిగుణాత్మికంగా సాగు తుంది. ఆయా గుణాలకనుగుణ రూపాలను ధరిస్తుంది ఆమాత. ఈ విషయాలను సప్తశతీ గ్రంథం 'యాదేవీ సర్వ భూతేషు విష్ణుమాయేతి శబ్దితా। నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః॥' అని 2 శ్లోకాలలో అభివర్ణించింది. ఈ శ్లోకాలలో ఆమె గుణత్రయాత్మకమైన రూపం గోచ రిస్తుంది. 'యా దేవీ సర్వభూతేషు విష్ణుమాయేతి శబ్దితా।' అని విష్ణుమాయతో నారంభింపబడి, చేతనా, నిద్రా, భ్రాంతి, క్షుధా, ఛాయా, శక్తి రూపంలో, తమోగుణాధిక్యత కలవారికి సాక్షాత్కరిస్తుంది. ఇది ఆశక్తియొక్క స్థూలరూపం. 'యాదేవీ సర్వభూతేషు విష్ణుమాయేతి శబ్దితా।' అని ఆవిష్ణుమాయ ప్రారంభమై, చేతనా, ఛాయా, శక్తి, తృష్ణా, జాతి, లజ్జా, లక్ష్మీ, వృత్తి రూపంలో రజోగుణ ప్రవృత్తికల వారికి కనిపిస్తుంది. ఇది ఆతల్లి సూక్ష్మరూపం. రజోగుణం ఎక్కువైతే ఈర్ష్యాసూయలు, కామక్రోధములు

మొదలైన అవలక్షణాలు ఉద్భవిస్తాయి. వీటిచే తగాదాలు. ఇక హృదయంలో అశాంతి, గృహంలో అశాంతి, సంఘంలో అశాంతి. ఎక్కడికి వెళ్లినా యీ అశాంతిని వెంటబెట్టుకొని వెళ్లి, అశాంతితో తిరిగి వస్తూ, ఆ అశాంతిని ప్రక్కవారికి కూడా అతికించి వస్తుంటారు యీ రకం మనుషులు. ఇక మూడవదైన సత్త్వగుణంలో 'యా దేవీ సర్వభూతేషు విష్ణుమాయేతి శబ్దితా।' అని ఆ విష్ణుమాయ చేతనా, ఛాయా, శక్తి, బుద్ధి, శ్రద్ధా, స్మృతి, శాంతి, క్షాంతి, కాంతి, దయా, తుష్టి, మాతృరూపమై ప్రకాశిస్తుంది. ఇది ఆమె ప్రశాంతమూర్తిమత్వం. ఇది ఆ తల్లి ప్రేమరూపం! దయారూపం! శాంతిరూపం! క్షాంతిరూపం! అనురాగరూపం! వాత్సల్యరూపం సుసూక్ష్మరూపం' జితేంద్రియులకు, శౌచసంపన్నులకు, అంతర్ముఖులకు అనుభవైకవేద్యం. అందుచేతనే 'అంతర్ముఖ సమారాధ్యాయై నమః' అని శ్రీలలితా సహస్రనామాలలో ఒకనామం ఉన్నది. ఈ సత్వగుణాధిక్యులు సకల సల్లక్షణోపేతులు. మేలిమి బంగారం వంటి వారు. అతిసౌమ్యులు. ప్రశాంతహృదయులు. తమ శాంతి సంపదను అందరికి పంచి యిస్తుంటారు. ఈ విధంగా త్రిగుణాత్మిక అయిన ఆతల్లి మరల త్రిగుణాతీతమై ఆత్మజ్ఞులకుమాత్రమే అనుభవైకవేద్యంగా ఉంటుంది. కాన తమోగుణ ప్రాబల్యం కలవాడు ఆగుణాన్ని అదుపులో పెట్టుకుని మమకార రహితుడు కావాలి. రజోగుణప్రధానుడు ఆగుణాన్ని నిగ్రహించుకుని, అహంకారరహితుడు కావాలి. సత్త్వగుణసంపన్నుడు నిర్మలత్వంతో ప్రకాశించి భక్తుడై జ్ఞాని కావాలి. ఇది ఉపాసనాక్రమం. తల్లి అనుగ్రహం వినా మానవుడేమీ చేయజాలడనుట సుస్పష్టం.

పశువులకంటే మానవుడికి వాక్కు, బుద్ధి అధికంగా అనుగ్రహించాడు సృష్టికర్త. తన లోపల

భావాలను వాక్కుద్వారా వ్యక్తం చేస్తాడు. బుద్ధినుపయోగించి పుణ్యాపుణ్య, ధర్మాధర్మ విచక్షణాజ్ఞానాన్ని పొందుతాడు. అందుచేతనే 'ధర్మోమూలం మనుష్యాణాం' మానవులకు ధర్మం మూలమని శాస్త్రం. అంతేకాదు. 'సత్యం వద', 'ధర్మం చర' అని వాక్కును కలిగిఉన్నవాడు కాన సత్యాన్ని పలకమని, బుద్ధిగలవాడగుటచే ధర్మాన్ని ఆచరించమని మానవుని ఆదేశించింది వేదమాత. 'ధర్మం వద' అని లేదు. నిత్యం ధర్మపన్నాలు వల్లెవేస్తూ, ధర్మ ప్రబోధాలు చేస్తూ ఉన్నవాడికి, ఆచరణరహితుడైనవాడికి 'ధర్మంచర' చక్కని ఉపదేశం చేసింది. ప్రబోధాలు వేరు, ప్రచారాలు వేరు, ఆచరణవేరు. ధర్మాచరణ లేకుంటే మోక్షం లేదు. అందుచేతనే పురుషార్థ చతుష్టయంలో ధర్మానికి ప్రధాన స్థానం కల్పించారు. ధర్మంవినా ఏ జీవితంలోనూ అభివృద్ధి కలుగదు. ఇది పరమసత్యం. ధర్మాన్ని సాధించి మోక్షాన్ని అందుకోవాలి. ప్రకృతికూడా ధర్మానికే ప్రథమ పీఠంవేసింది.

సంవత్సరానికి ద్వాదశమాసములు. అందులో మొదటిది చైత్రమాసం. 'చైత్రశుక్ల ప్రతిపది వత్సరారంభః' చైత్ర శుద్ధ పాడ్యమిని సృష్టిని బ్రహ్మ ప్రారంభించినట్లుగా నిర్ణయసింధు వచనం. చైత్ర శుద్ధ పాడ్యమి యుగాది, లేక ఉగాది అని అర్థం. పాడ్యమినుండి వసంత నవరాత్రులు ప్రారంభిస్తారు. చైత్ర శుద్ధ నవమి శ్రీరామనవమి. ఆదినంతో వసంత నవరాత్రులు పూర్తి. పాత ఆకులను రాల్చి, క్రొత్తచిగుళ్ళువేసి, ఆపై పుష్పించి, ఆహ్లాదాన్ని కలిగిస్తూ ఉంటాయి వృక్షాలన్నీ. తమ ధర్మాన్ని అవి పాటిస్తాయి. శ్రీరామచంద్రుడు అవతరించిన మాసం చైత్రం. 'రామో విగ్రహవాన్ ధర్మః' అను వాల్మీకిముని చంద్రునిచే కీర్తింపబడిన రఘురాముడు ధర్మస్వ

రూపుడు, సత్య సంధుడు, పితృవాక్య పరిపాలనా ధురంధరుడు. ధర్మాచరణమే జీవిత ధ్యేయమని భావించి, ఆచరించి చూపిన సీతారాముడు జన్మించిన మాసమగుటచే నీచైత్రమాసము ధర్మప్రాశస్త్యాన్ని నొక్కి పలికిందని చెప్పవచ్చును. 'యతో ధర్మస్తతో జయః' ధర్మమున్నచోట జయం సిద్ధిస్తుంది. కాబట్టి మానవుడు ధర్మంతో జీవించాలి. ధర్మంతోనిండి పోవాలి. ధర్మంతో పండిపోవాలి. అందుచేత యీ వసంత నవరాత్రులు ధర్మాన్ని ప్రబోధిస్తున్నవి. అసలు దశావతారములలో మత్స్య, కూర్మ, వరాహ, నృసింహ, వామన, పరశురామావతారములు అర్చనావతారములైయుండగా, రామచంద్రునినుండి అనుసరణావతారములైనవి. పరిపూర్ణ ధర్మపాలకుడైన ఆ రామప్రభువును, ఆయన ఆదర్శమును అందరూ అనుసరింపవలసినదే! ధర్మాన్ని ఆచరించాలని శ్రీరామభద్రుని ఆదేశం. అందుచేత చైత్రమాసం ధర్మప్రబోధ మాసంగా భావించవచ్చును.

ఇక భాద్రపదమాసంలో వచ్చేవి గణపతి నవరాత్రులు. గణములకు పతి ఆయన. గణములంటే యింద్రియాలనీ, వాటికి అధిపతి యగుటచే గణాధిపతిగా పూజలందుకుంటున్నాడు. ఈ యింద్రియాలు శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా ఘ్రాణములను పంచ జ్ఞానేంద్రియములుగా, వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలను పంచ కర్మేంద్రియములుగా చెప్పింది శాస్త్రం. ఈ దశేంద్రియ స్వాధీనుడు వినాయకుడు. బ్రహ్మచారిగా ప్రసిద్ధి పొందాడు. బ్రహ్మచర్యం వలన బుద్ధి వికసించి, సిద్ధికలుగుతుందని అర్థం. బుద్ధి, సిద్ధి ఆయనకు శక్తులు. చతుష్పాద జంతువులలో ఏనుగు చాలా పెద్దది. మూషికం చాలా చిన్నది. ఆయన మూషికవాహనుడన్నారుగదా! అర్థం ఏమిటి? స్థూలశరీరమును ధరించినా సూక్ష్మబుద్ధితో, సూక్ష్మగ్రాహి కావాలని గజ మూషికములు మనకు బోధిస్తాయి.

అంతేకాక పంచస్థూలభూతాత్మకమైన యీ స్థూల శరీరంతో, సూక్ష్మభూతములైన పంచ తన్మాత్రలను సూక్ష్మమగు బుద్ధితో గ్రహించి, స్థూలసూక్ష్మకారణాత్మక మగు భగవానుని భక్తితో సేవించాలని కూడా అర్థం. ఇంద్రియజయం సిద్ధిస్తేగాని సూక్ష్మబుద్ధి వికసించదు. బుద్ధివికాసం కలిగితేగాని వివేకం కలుగదు. వివేకం వస్తేగాని విరాగం రాదు. వైరాగ్యం కలిగితేగాని మోక్షం లభించదు. ముక్తివలనగాని నిర్మలానందం చేకూరదు. ఇంత సాధనా విధానం యీ యింద్రియ నిగ్రహంలో అంతర్గతం. ధర్మాన్ని యీ యింద్రియ నిగ్రహసాధనతో స్థిరంగా కాపాడుకోవాలని అర్థం. ఈయింద్రియనిగ్రహరూపంలో గణపతి నవరాత్రులు భాద్రపదమాసంలో అవతరించాయి.

ఆపైన ఆశ్వయుజమాసంలో ప్రారంభమయే దేవీ నవరాత్రులు. దేవి అనగా జగన్మాత. అనగా తల్లిపూజతో యీ నవరాత్రులను ఆరంభిస్తారు. జగదంబ అనుగ్రహం ఉంటే సర్వం సాధ్యమే. అందుచేతనే వేదమాతకూడా 'మాతృదేవో భవ' అని ప్రథమస్థానం తల్లికేయిచ్చింది. 'న మాతుః పరదైవతం' అని అగ్రాసనం ఆమెకే అర్పించారు. లలితా సహస్రనామంలో 'శ్రీమాత్రే నమః' అను మొదటి నామం ఆమెదే. ఎందుకింత ప్రాధాన్యత? తల్లికున్న పవిత్రస్థానం లోకంలో యింక ఎవరికీ లేదు. తల్లినుండి మొదలైన యీ పవిత్రభావనకు, ఉపనయనంలో ఉపదేశింపబడిన గాయత్రీమంత్రా నుష్ఠానంతో స్థిరత్వాన్ని పొంది, గురుకులవాసంలో గురుపత్నిని మాతృభావనతో చూచి, ఆమె వాత్సల్యా నంపాదించి, ఆపైన దేవ్యుపాసనలో ఆమెను జగన్మాతగా ఆరాధన సలిపి ధన్యాత్ముడవుతాడు సాధకుడు. పవిత్రతలో ప్రథమ బహుమతిని అందుకుంటే జగదంబ దర్శనం తప్పక లభిస్తుంది. పవిత్రదృష్టి, పవిత్ర వేదాధ్యయనం,

పవిత్ర శ్రవణం, పవిత్ర భావన పవిత్ర గురు సన్నిధానంలో పవిత్ర శరీరుడై సాధన చేసిన వాడికి సర్వం లభిస్తాయనడంలో సందేహం లేదు. అట్టి పవిత్ర శరీరాలను అపవిత్రులు స్పర్శిస్తే ఆశరీరాలు తపించిపోతాయి. ఇది మహనీయుల జీవితాలలో మనం చూడగలం. శ్రీరామకృష్ణ పరమహంస నిత్యం సమాధిస్థితులో ఓలలాడుతూ ఉండేవాడు. ఒక్కొక్కసారి ఆయన నిలుచున్నప్పుడు సమాధిని పొందటం జరిగేది. ఆయనను పట్టుకునేవారు ఒకరిద్దరు మాత్రమే ఉండేవారు. అన్యులెవరైన తాకినచో ఆయన శరీరంలో మంటలు పుట్టేవి. అదేవిధంగా శ్రీ శారదామాయి జీవితంలో అనేక సంఘటనలున్నవి. కొంతమంది వచ్చి, పాదాభివందనం చేయగానే ఆమె పాదాలు మంటలు పుట్టేవి. తర్వాత ఆమె గంగాజలంతో పాదప్రక్షాళన చేసుకొనేది. యథార్థ భగవదనుభూతుల ననుభవించిన అనుభవ మూర్తులు వారు. వారి శరీరం పవిత్రాతిపవిత్రం. ఈ లౌకికుల వ్యామోహం అనే అగ్నికి వారు తట్టుకోలేరు. ఒక్కొక్క వ్యక్తి వద్ద శ్రీరామకృష్ణుడు కూర్చొనలేక 'అమ్మా! నేను యిక్కడ ఉండలేకున్నాను. నా శరీరంలో మంటలు ప్రారంభిస్తున్నాయి' అంటూ లేచి, ప్రక్కకు వెళ్లేవాడు. ఇది పవిత్రత అంటే. ఈపవిత్రభావనను మనకందించిన తల్లి కన్నతల్లి. ఆమెతో ఆరంభింపబడిన యీ పవిత్రత లోకమాత నాశ్రయించి, ఆమెతో లీనం కావాలి. ఈ పవిత్రత పరాకాష్ఠ నందుకుంటుంది యీ శాక్తేయంలో. జగదంబ అనుగ్రహంతో యింద్రియనిగ్రహుడై, ధర్మబద్ధుడై, ధర్మరతుడై, ధర్మస్వరూపుడై, ధర్మప్రబోధకుడు కావాలి మానవుడు.

ఈ విధంగా, చైత్రశుద్ధ పాడ్యమినుండి నవమి వరకు వసంత నవరాత్రులుగా, భాద్రపద శుద్ధ చవితినుండి ద్వాదశి వరకు గణపతి నవరాత్రులుగా,

ఆశ్వయుజ శుద్ధ పాడ్యమినుండి నవమివరకు శరన్నవ రాత్రులుగా ప్రసిద్ధమైన యీ నవరాత్రిత్రయం, ధర్మాచరణ, జితేంద్రియత్వ, దేవ్యుపాసనలచే సాధకుని అభివృద్ధికి మూలకారణం అవుతున్నాయి. అంతేకాక యీ నవరాత్రులన్నీ శుద్ధంలోనే ప్రారంభం. గమ్యం ఆహ్లాదకరమైన చంద్రుడు. అదేవిధంగా శుద్ధుడైన సాధకుడు కూడా షోడశకళా ప్రపూర్ణుడైన నిశాకరునివలె ప్రకాశించాలని అర్థం. శంకరుని శిరోభూషణంగా చేరి, చల్లనివెన్నెల వెద జల్లు చంద్రుని వలె, జగన్మాత అనుగ్రహఆశీర్వాద బలంతో ఆధ్యాత్మికోన్నతిని గడించిన మహాత్ముడు కూడా చల్లని ఆధ్యాత్మిక జ్ఞానకిరణాన్ని ప్రసాదిస్తాడు. ఇది నవరాత్రి విశిష్టత.

నవమాసాలు మాతృగర్భంలో బంధితుడై, నవ ద్వారములు గల యీ శరీరాన్ని పట్టుకొని, నవ గ్రహములకు లోబడి, నవధాన్యముల భుజించి, నవ రసముల నాస్వాదించి, నవ రత్నముల ధరించి, నవ రాత్రుల, నవదుర్గల, నవభక్తి విధానాలతో అర్చించి, ఆ నవశబ్దాన్ని 'మానవ' అనే పదంలో కూర్చుకున్నాడేమో! కాని నవ = నీవు క్రొత్తవాడివి, మా = కాదు అను నిత్య సత్య ఆత్మను, అనాది సిద్ధమైన ఆత్మానుభూతిని మాత్రం గ్రహింపనేరక, అంతా మరచి, శరీరభ్రాంతిచే, ప్రపంచంలో, చంచలమైన మనస్సు నూతగాగొని, లౌకికంగా నవ = నూతన విషయాలను కనుగొన యత్నం చేస్తున్నాడు నేటిమానవుడు. భౌతిక విజ్ఞాన స్థిరత్వానికి ఏర్పాట్లు చేస్తున్నాడు. వాటికి స్థిరత్వం ఏనాటికీ లభ్యం కాదనే పరమ సత్యాన్ని విస్మరిస్తున్నాడు. సుఖం కోసం తాపత్రయం ఎక్కువైనది. కాని సుఖానికి వ్యతిరేకం ఒకటున్నది. అదే దుఃఖం. లౌకిక జీవితంలో సుఖం దుఃఖం రెండు కలుగుతాయి. భగవదనుభవంలో

ఆనందం సిద్ధిస్తుంది. ఆనందానికి వ్యతిరేకపదం లేదు. సుఖం కాంక్షించేవానికి దుఃఖం తప్పదు. విద్యుచ్ఛక్తి ఉన్నప్పుడు సుఖం, అదిలేకున్న దుఃఖం. కారు కొన్నప్పుడు సుఖం, ప్రమాదం జరిగితే దుఃఖం. భోగం సుఖం, రోగం దుఃఖం. ఈ ద్వంద్వ ప్రపంచంలో, యీ ద్వంద్వం మానవునిపై సవారి చేస్తుంటాయి. కాని యీ నవ శబ్దంలో నున్న నిత్యనూతనత్వం మానవుని ఆధ్యాత్మికత సాధనా విధానంలో రావాలి. ఆ సాధనా ఫలితంగా శాంతితో కూడిన నూతనత్వం భావంలో, ప్రవర్తనలో, దృష్టిలో, మాటలో, చేతలో, రచనలో, గానంలో సిద్ధిస్తుంది. ఈ నవ నవోన్మేషణమైన ప్రజ్ఞాస్థితిలో అహంకారంలేదు. ఈర్ష్యాదు లుండవు. కోపతాపాదులు దరిదాపునకు రాలేవు. అంతా ప్రశాంతిమయం. ఈ స్థితిని సిద్ధింప జేసుకోటానికి నవ శబ్ద ధారియైన మానవుడు, నవ రాత్రుల రహస్యాన్ని, దేవ్యర్చనా విధానాన్ని గ్రహించి, మానవుడిలో మొదటి అక్షరమైన 'మా' అనగా తల్లి అనే అర్థాన్ని కలుపుకొని మాత్రారాధనా మగ్నుడు కావాలి.

ఈ 'నవ' శబ్దానికి చాలా ప్రాధాన్యం ఉన్నది. నవ అనగా తొమ్మిది అని అర్థం. 9 తర్వాత అంకెలేదు. సంవత్సరానికి 360 రోజులు గదా! 3+6+0 =9 అయినది. ఈ నవ సంఖ్యను ఆధారంగా గ్రహించి శ్రీవ్యాస భగవానుడు అష్టాదశ పురాణాలను, అష్టా దశ ఉపపురాణాలను, అష్టాదశ పర్వాలతో భారతాన్ని భగవద్గీతకు అష్టాదశాధ్యాయాలను వ్రాశాడు. గీత 2వ అధ్యాయంలో స్థితప్రజ్ఞుని గూర్చివచించిన శ్లోక ములో ('ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్ ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్త దోచ్యతే' అని 54 నుండి 'ఏషా బ్రాహ్మీస్థితిః ... అని 72 వరకు) పదునెన్మిది అయినవి.

'కురుక్షేత్ర యుద్ధరంగమున 18 అక్షౌహిణులున్నవి. యుద్ధము 18 దినములు జరిగినది. 18 అనగానే 1+8 =9 అని అర్థం. 9వ ఎక్కం చదివితే, అన్నీ కూడితే 9 వస్తుంది. 9×1=9, 9×2=18, 1+8=9, 9×3=27, 2+7=9, 9×4=36, 3+6=9 అవుతుంది. అదే విధంగా9 వ ఎక్కంలో గుణించగా వచ్చిన అంకెకు 9 కలిపినా 9 వస్తుంది. 9×1=9+9=18 అయింది. 1+8=9 అయినది గదా! 9×2=18+9=27 అయినది. 2+7=9. అంతేకాక 1 నుండి 9 వరకు కూడితే 45 వస్తుంది. 4+5=9 వచ్చింది. 11నుండి 19 వరకు కూడితే 135 అవుతుంది. 1+3+5=9 అయినది. అదే విధంగా నవరాత్రి త్రయంలో 9×3=27 వచ్చింది. పాడ్యమి నుండి నవమివరకు అనగా 1 నుండి 9 వరకు కూడితే 45, చవితినుండి ద్వాదశి వరకు అనగా 4 నుండి 12 వరకు కూడితే 72, మరల పాడ్యమినుండి నవమి వరకు అనగా 1 నుండి 9 వరకు కూడితే 45 వచ్చింధి. ఇవే వసంత, గణపతి, దేవీ నవరాత్రులు. 45+72+45=162 అయి, 1+6+2=9 వచ్చింది. ఈనవ సంఖ్య ఆధారంగా దేవీ నవరాత్రుల్లో నవదుర్గల నర్చించి, నవావరణ సంయుత శ్రీ చాక్రార్చన భక్తితో గావించి, మానవత్వాన్ని అధిగమించి, మహోన్నతుడై విజయదశమితో పరిపూర్ణత్వాన్ని సాధించాలి శాంతికాముకుడు. భగవతి అనుగ్రహంతోనే సిద్ధి కలగాలి. మనుష్యత్వం ముముక్షుత్వం, మహాపురుషుల ఆశ్రయాలు కూడా 'దుర్లభం త్రయమేవై తత్ దైవానుగ్రహహైతుకం' భగవదనుగ్రహంతేనిదే లభించవు అన్నారు వివేక చూడామణి గ్రంథంలో శ్రీ శంకరులు. కావున మానవునిలో త్రివేణీ సంగమంలాగా పైమూడు ఉంటేనే యీ నవరాత్రిపూజా విధానంలో ఒక్కొక్క మెట్టు ఎక్కుతాడు. 'ప్రథమం శైలపుత్రీతి ద్వితీయం బ్రహ్మచారిణీ|

తృతీయం చంద్రఘంటేతి కూష్మాండేతి చతుర్థ కం॥ పంచమం స్కందమాతేతి షష్ఠం కాత్యాయనీతి చ। సప్తమం కాళరాత్రీతి మహాగౌరీతి చాష్టమం॥ నవమం సిద్ధిదా ప్రోక్తా నవదుర్గాః ప్రకీర్తితాః॥, శైల పుత్రి, బ్రహ్మచారిణి, చంద్రఘంట, కూష్మాండ, స్కందమాత, కాత్యాయని, కాళరాత్రి, మహాగౌరి, సిద్ధిద అని దేవీ కవచంలో నవదుర్గలు చెప్పబడినవి.

అసలు యీ శక్త్యారాధన ఎందుకు చేయాలి? దీనికింత ప్రాముఖ్యం ఎందుకు కలిగింది? ప్రతి వ్యక్తికి శక్తికావాలి. 'నాయమాత్మా బల హీనేన లభ్యః' ఆ యాత్మ బల హీనులక లభ్యమని ఉపనిషద్వచనం. ఈ విషయం అందరికి సుస్పష్టమే. అందుచేతనే 'రుద్ర హీనం విష్ణుహీనం న వదంతి జనాస్తథా। శక్తి హీనం యథా సర్వేప్రవదంతి నరాధమం॥' ఎవరినైనా రుద్ర హీనుడనిగాని, విష్ణు హీనుడనిగాని చెప్పరు. శక్తిహీనుని మాత్రం అందరూ నరాధము నిగా చెప్పుకుంటారని దేవీభాగవత వాక్యం. మరి సర్వప్రపంచంలో, చరాచరజీవకోటిలో అంతర్గతమై, కదిలించు ఆ శక్తి ఏది? విద్యావంతులలో విద్యా శక్తియై, ధర్మపరులలో ధార్మికశక్తియై, ధనవంతులలో ధనశక్తియై, వాక్కులో వాక్శక్తియై, యోగులలో యోగశక్తియై, జ్ఞానులలో జ్ఞానశక్తియై, మనస్సున సంకల్పశక్తియై, వర్ణింపనలవికాని అనిర్వచనీయ మైన ఆ దివ్యశక్తి, తన శక్తిని సర్వత్ర ప్రసరింపజేస్తూ, శక్తిమంతంగా పరిపాలిస్తున్నది. ఆమె శక్తి అనంతం, అపారం. అనేకములలో నేకమైయున్న ఆ లోక మాతకు ప్రణతులు. ఆయుధములలో, విద్యలలో, ధర్మములో, కళలలో నున్న ఆ యా శక్తులను తమ మనస్సుతో గ్రహించి, / స్థూల సూక్ష్మ విభాగము గావించి, పరస్పర సహకారంతో మానవులు తమ జీవితరథాన్ని లాగుకోవాలి. అందరిలో అన్ని రూపాలలో వెలుగొందే శక్తి ఆరాధన మానవునికి అత్యావసరం.

ఇక ఆ శక్తిని అంధరికి ప్రేమరూపంలో 'యా దేవీ సరవ భూతేషు ప్రేమారూపేణ సంస్థితా। నమస్తస్యై నమస్తస్యై నమస్తసైయ్తై నమోనమః' అందరికి అందించింది సప్తశతి. కన్నతల్లి అయినా కోపంగా ఉంటే కన్నబిడ్డకూడా జంకుతాడు దగ్గరకు వెళ్లటానికి. అనగా సర్వప్రపంచం యీ ప్రేమశక్తిపై ఆధారపడి ఉన్నదని వక్తం. ఈప్రేమ ఎన్నివిధాలో నిర్వచింటానికి బహుశః ఆబ్రహ్మకైనా తెలిదేమో! మాతృప్రేమతో ప్రారంభమైన యీ ప్రేమ, మధ్యలో భార్య, భర్త, బిడ్డ, ధనం, ధాన్యం, దేశ ప్రేమలుగా స్వార్థంతో కలుషితమై, మరల గురు, దైవ ప్రేమలుగా విజృంభించి, నిస్వార్థ బుద్ధితో, పవిత్ర ప్రేమతో భగవతిని చేరుకోవాలి. ఏ తల్లి ప్రేమతో మానవుడు పెరిగి పెద్దవాడయ్యాడో ఆ ప్రేమనే గుర్తుంచుకుని, ఆ పవిత్రప్రేమనే జగన్మాతపై నుంచి, అర్చించి, కీర్తించి, ప్రార్థించి, తపించి, ఆవేదన చెంది అర్థిస్తే ఆ తల్లి తప్పక కరుణిస్తుంది. ఆమె ప్రేమకు ఆద్యంతములు లేవు. అనిర్వ్యాజ్యమైన ప్రేమ ఆ తల్లిలోనే కనిపిస్తుంది. ఇక యీ లౌకిక ప్రేమ ప్రేమ కాదు వ్యామోహం. వ్యామోహం తగ్గితే యీ ప్రేమకూడా దిగజారుతుంది. ఇది ప్రేమ పేరుతో నున్న స్వార్థం. స్వార్థం అధికం అయితే యీ ప్రేమలో సంకుచితం చేరుతుంది. పరస్పరం వ్యామోహంలో పడి, ఒకరి స్వార్థానికి మరొకరిని ఉపయోగించుకుంటూ, ఆకర్షణలు తగ్గిన వెంటనే తగాదాలతో అంతమయ్యేది యీ లౌకిక ప్రేమ. ప్రేమ అంటే భగవత్ప్రేమయే. ఈ పవిత్రప్రేమలో విశాలత్వమేగాని సంకుచితత్త్వం లేదు. ఈ పవిత్ర ప్రేమలో నిస్వార్థమేగాని స్వార్థం అగోచరం. మొదట సంకుచితంగా గోచరించిన యీ నిర్మల ప్రేమ విశ్వమంతా వ్యాపిస్తుంది. కాన యీ ప్రేమ యందలి పవిత్రతా రహస్యాన్ని గ్రహించి, వినిర్మల

ప్రేమ శక్తికి 'దాసోహం' అంటూ చేతులు జోడించి, 'పవిత్రం చరితం యస్యాః పవిత్రం జీవనం తథా! పవిత్రతా స్వరూ పిణ్యై తస్యై దేవ్యై నమో నమః' అను రీతిగా ఆ శక్తిని ప్రేమమూర్తిగా, ప్రేమమయిగా, ప్రేమజలధిగా ఆరాధించి ప్రేమార్ణవంలో లీనం అవుతాడు ప్రేమోపాసకుడు. ఈ ఉపాసనచే సాధకుడికి 'ముఖం ప్రసన్నం విమలా చ దృష్టిః తథానుకంపో మధురా చ వాణీ! స్నేహాధికః...॥' ప్రసన్నమైన ముఖం, నిర్మమైన దృష్టి, వాఙ్మాధుర్యం, దయ, అధికమైన ప్రేమలు సిద్ధిస్తాయి. యథార్థ ఉపాసకుడికి యివి మువ్మాటికీ లభిస్తాయి. నటించాలంటే వచ్చేవి కావు యీ లక్షణాలు. బయటనుండి ఉద్భవిం చేవి కావు. అంతరంగంలో అనుభవంతో పుట్టాలి. వేపచెట్టుకు ఎన్ని చక్కెర మూటలు వేసినా వేపకాయకు తీపిరాదు. పాముకు ప్రతిదినం పాలను పోసినా పాములోనుండి విషమే బయటకు వస్తుంది. నాలుకకు ఎన్ని తీపి పదార్థాలు తినిపించినా మధురంగా మాట్లాడటం వస్తుందా? ఉపాసనా బలం, సాధనా బలం, గుర్వనుగ్రహం, భగవతి ప్రేమలు ఉంటేనే మానవుడు సకల సద్గుణోపేతుడు అవుతాడు.

ఈ ప్రేమ లోకంలో చేరి ఏవిధంగా పరిణ మించింది? 'యా దేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా। నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః॥' అని మాతృమూర్తిగా మార్చింది ఆ సప్తశతీ గ్రంథరాజం. అనగా మాతృరూపంలోకి ప్రవేశిం చింది. శక్తిలో భేదాలున్నవి. ప్రేమలో భేదాలున్నవి. కాని తల్లిలోమాత్రం భేదం అగోచరం. తెల్లవారి లేచింది మొదలు 'అమ్మా' అని పిలిచే పిలుపులో ఏమాత్రం భేదం లేదన్న విషయం అందరికి తెలుసును. ఏ జాతిలోనైనా, ఏభాషలోనైనా, ఏదేశంలోనైనా, ఏపక్షిపికైనా, ఏజంతువుకైనా తల్లి తల్లియే. అదే

తల్లియందలి ప్రత్యేకత. ప్రతి తల్లి తన బిడ్డను ప్రేమిస్తుంది. మనకందరికి క్రూర జంతువులుగా పరిగణింపబడిన సింహ శార్దూలాదులు కూడా వాటి సంతానాన్ని అవి ప్రేమిస్తాయి. తల్లి లక్షణం బిడ్డను ప్రేమించటం. అందరికంటే సన్నిహితమైనది తల్లి.

ఎంత మంది సంతానమున్నా 'అమ్మా' అని పిల వగానే పలుకుతూ, ఎవరికి ఏమికావాలో వారికి వాటిని అందిస్తూ, అందరికీ ఆనందాన్నిస్తూ, వారందరినీ ఒకేవిధంగా ప్రేమిస్తూ, వారి సుఖదుఃఖాలలో భాగస్వామియై, వారిని జాగ్రత్తగా చూచే శక్తి ఒక్క తల్లికే ఉందనడంలో అతిశయోక్తి లేదు. కాని యీ సంతానమంతా పెద్దవారై, విద్యా వంతులై, ఉద్యోగస్థులై, వివాహితులైన తర్వాత, తమనుండి ఏమియు ఆశింపక సేవజేసిన ఆ తల్లిని, తమ క్షేమంకొరకు సదా తపించిన ఆ తల్లిని, వృద్ధాప్యదశలో శక్తిలేక బలహీనమైన ఆ తల్లిని, ఆ ఒక్క తల్లిని పోషించటానికి, ఎంత ఆలోచిస్తారో! ఇది లోకం తీరు. కాని యీ జన్మనిచ్చిన తల్లి శరీరాన్ని పోషిస్తుంది, మానసికాభివృద్ధిని కలిగిస్తుంది. మోక్షాన్ని మాత్రం అందించలేదు. అది లోకేశ్వరి పనిగదా! ఆతల్లి, మానవుని కర్మ జనితమైన యీ అనిత్య శరీరవిషయాన్ని గ్రహించ టానికి వివేకజ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. భక్తి మాధుర్యాన్ని రుచి చూపిస్తుంది. విజ్ఞాన రహస్యాలను విశదీకరి స్తుంది. దివ్యప్రేమామృతాన్ని వర్షిస్తుంది. తనను హృదయపూర్వకంగా విశ్వసించినవారి సర్వ బాధ్యతలను స్వీకరిస్తుంది. ఆమె వాత్సల్య ప్రవంతిలో పసిబిడ్డయై ఆనందాన్ననుభవించటమే యీ భక్తుని స్థితి. చివరి కి ముక్తినికూడా ప్రసాదించి, బంధ నాశనం చేసి, జన్మరాహిత్యాన్ని అనుగ్రహిస్తుంది. జన్మనిడిన యీతల్లిప్రేమను గ్రహించు కున్నవారు ఆ విశ్వజనని

విశ్వప్రేమను అందుకొనగలరు. కాని యీ తల్లి ప్రేమను అర్థం చేసుకోలేనివారు, ఆలోకమాత విశ్వేశ్వరి విశాల ప్రేమను గ్రహించలేరు. అందుచేత మానవుడు జగదీశ్వరి అనుగ్రహ పాత్రుడు కావాలని ఆశించిన మన వేదమాత 'మాతృదేవో భవ' అని తల్లికి ప్రథమస్థానాన్ని యిచ్చింది.తెలిసినదాని నుండి తెలియని దానికి అన్వేషణ. తల్లికి ప్రథమస్థానం యిచ్చినవానికి విద్యలో ప్రథమస్థానం, గురువర్యుని సన్నిధిని వేదాధ్యయనంలో ప్రథమస్థానం, ఆధ్యాత్మిక జీవితంలో ప్రథమస్థానం, ప్రపంచంలో ప్రథమస్థానం ఆక్రమించగలడనుటలో సందేహం లేదు. ఈ తల్లి నుండి పొందిన ప్రేమతో సృష్టికి మూలాధారమైన ఆ జగన్మాతకై తపించాలి. ఆ మాతృమూర్తిని దర్శించాలి. ఆ తల్లినుండి వాత్సల్యాన్ని పొందాలి. ఆమె ఒడిలో నిశ్చింతగా ఒదిగిపోవాలి. ఇంతకంటే కావలసినదేమున్నది? ఈ మహద్భాగ్యాన్ని మానవునికి అందించటానికే ఆ సర్వవ్యాపక శక్తి ప్రేమరూపిణియై, మాతృమూర్తిగా రూపాన్ని ధరించింది. మానవజన్మ చేసుకోవలసిన పుణ్యం యిదే! ఆ తల్లిని మనో వాక్కాయములద్వారా అంటే త్రికరణములద్వారా పూజించాలి. 'య న్మనసా ధ్యాయతి తద్వాచా వదతి। యద్వాచా వదతి తత్కర్మణా కరోతి' మనస్సుతో ధ్యానించినది, వాక్కుతో పలికినది, చేతలలో చేసేది ఏకం కావాలి. ఇదే త్రికరణ శుద్ధి. దీనిద్వారా సిద్ధి. త్రికరణశుద్ధి లేనిచో కార్యసిద్ధి కలుగదు.

ఈ ఉపాసనావిధానం ఎటువంటిది? ఉపాసనలో అనేక భేదాలు ఉన్నప్పటికి ముఖ్యంగా ప్రతిమోపాసన, ప్రతీకోపాసన, అహంగ్రహోపాసన అని ఉపాసన త్రివిధం. సగుణమై, సాకారమై, సావయవమైనది ప్రతిమోపాసన అని అర్థం. సకల సద్గుణములతో

నలరారుతూ, సుందరమైన ఆకారమును దాల్చి, చక్కని అవయవ సంపదతో తులతూగి, భక్తుల మనస్సు నాకర్షించి, వారి హృదయగత ఆవేదనను గ్రహించి, వారి ప్రార్ధనల నాలకించి, వారిని వాత్సల్యంతో ఆదరించి, వారి మనస్సుకు శాంతిని ప్రసాదించి, వారి ఉపాసనావిధానానికి అనుగుణరూపాన్ని ధరించి, వారిని తరింపజేసే దివ్యమూర్తి ప్రతిమోపాసనలోని ఆరాధ్యదైవం. ఈ ప్రతిమోపాసనా విధానం స్థూలమైనది. దుష్టశిక్షణ, శిష్ట రక్షణార్థం, అనేక సుగుణములతో, 'మోహనరూపాయ' మోహన రూపంతో, 'ఆజానుబాహుమరవింద దళాయతాక్షం' ఆజాను బాహుడై, అరవింద దళాయత నేత్రుడై శ్రీరామభద్రుడు అవతరించాడు. 'నల్లనివాడు పద్మ నయనంబులవాడు' అనియు, నీలమేఘ శరీరుడ నియు, శిఖిపింఛధారి యనియు, సౌందర్యరాశి యనియు వేనోళ్ల కీర్తింపబడిన శ్రీకృష్ణ భగవానుడు కూడా అవతరించాడు. ఈ ప్రతిమోపాసనద్వారా యీ అవతారముల సాక్షాత్కరింపజేసుకొన వచ్చును.

ఇక రెండవది ప్రతీకోపాసన. ఇందలి ఉపాసనా దైవం సగుణ, సాకార, నిరవయవమైనది. ఇదియే శివలింగము. అవయవ రహితమైన ఆకారము బ్రహ్మాండాన్ని సూచిస్తుంది. అవయవసహితమై యున్న శివుడు నాగభూషణుడై, చంద్ర శేఖరుడై, గజచర్మాంబరుడై, త్రిశూలధారియై, స్మశానవాసియై, కామవిజేతయై, త్రినేత్రుడై, సమాధినిష్ఠాగరిష్ఠుడై, వాత్సల్యాది గుణోపేతుడై, భక్తవశంకరుడుగా ఉంటాడు. శివునికి ప్రతిమా, ప్రతీకలు రెండు రూపములున్నవి. ప్రతిమలు గల ఆలయములు చాలా తక్కువ అనవచ్చును. సాధారణంగా శివాలయాలలో శివలింగమే గోచరిస్తుంది. ఈ ప్రతీకోపాసన శైవంలోనే ఉన్నదని చెప్పాలి. ఇది సూక్ష్మరూపం. ఈ ఉపాసనా విధానంకూడా సూక్ష్మమే.

ఈ ఉపాసన స్థూలంనుండి సూక్ష్మానికి సాగుతుంది. ఈ ఉపాసకుని బుద్ధిని సుసూక్ష్మానికి తీసుకొని పోతుంది. అందువలన యీ ఉపాసకునికి బుద్ధిసూక్ష్మత, సూక్ష్మభావగ్రహణం, సూక్ష్మదృష్టి మొదలైన సూక్ష్మలక్షణాలు అభివృద్ధి చెందుతాయి. పృధి వ్యాప స్తేజోవాయు రాకాశములనేవి పంచ భూతములు. ఈ పంచ భూతములతో నిర్మించబడ్డది ఈ శరీరంకూడా పంచభూతాత్మకమే. ఈ పంచ భూతములు ఒకదానికంటె ఒకటి సూక్ష్మం. ఇటువంటి పంచ భూతాలను ధరించి శివుడు పంచభూతాత్మకుడు అయ్యాడు. భస్మధారణ పృధ్వీ భూతాన్ని, గంగను శిరస్సుపై నుంచుకొనుటచే జలభూతాన్ని త్రినేత్రధారి యగుటచే అగ్ని భూతాన్ని సర్పములు ధరించుటచే వాయు భూతాన్ని దిగంబరుడగుటచే ఆకాశభూతాన్ని ధరించి పంచభూతధారి అయ్యాడు మహా శివుడు. ఈ సూక్ష్మ రహస్యాలను ఏకాగ్రమైన తపస్సుచే గ్రహించిన మన భారతీయ ఋషిచంద్రులు, ఆయా భూతముల సూచించు పంచ లింగములను పంచ క్షేత్రములలో ప్రతిష్ఠించి, మానవ మనస్సులను దైవోన్ముఖం చేయటానికి యాత్రలనుకూడా నిర్దేశించారు. యాత్రలు చేయాలనుకునే వారు పోస్టుకార్డులాగ కాక, క్షేత్ర విశిష్టతను, దైవ ప్రాశస్త్యాన్ని గ్రహించాలి. కంచి, రామేశ్వరములలో సైకత లింగము అనగా పృథ్వీ లింగము, జంబుకేశ్వరంలో జలలింగము, అరుణాచలంలో తేజోలింగము, శ్రీకాళహస్తిలో వాయు లింగము, చిదంబరంలో ఆకాశలింగము లున్నవి.

ఈ పంచభూత ఉపాసన స్థూలమైన పృథ్వీభూతంతో ప్రారంభం. భూమి కఠినత్వం కలది. అనగా గట్టిది. దున్నితే యీ భూమిమెత్తగా తయారవుతుంది. మెత్తగా ఉంటేగాని విత్తనం వేయటానికి అవకాశం లేదు. విత్తనం వేస్తేగాని మొక్క పుట్టదు. మొక్క

పెరిగి పుష్పించాలి. ఆపైన కాయగా మారాలి. తర్వాత ఆ కాయ ఫలం అవుతుంది. ఇదే విధంగా సాధనకూడా కొనసాగించాలి. అనేక జన్మలనుండి ప్రాపంచిక విషయాలతో గడ్డకట్టి, గట్టి అయిన హృదయక్షేత్రాన్ని, కఠినాతి కఠినమైన నియమనిష్ఠలతో బాగా సాగుచేసి, అందులో వేద సూక్తు లను విత్తనములు నాటి, మొలిచిన మొక్కలను భక్తి జలంతో పోషిస్తూ, ఇంద్రియ ప్రవృత్తులు అనే కలుపుమొక్కలను మనో నిగ్రహంతో నశింపజేసి, కామ క్రోధాదులనే చీడపురుగులను తపస్సుచేత భస్మీభూతం గావించి, బ్రహ్మజ్ఞానమనే పంటను పండించుకోవాలి. భూమికి గల కాఠిన్యతను కఠిన నియమాలతో, కఠిన తపస్సుతో ఆదర్శంగా గ్రహిస్తాడు. ఈ సాధనా ఫలితంగా భూదేవికి గల క్షమాగుణం సిద్ధిస్తుంది. క్షమాశీలుడై ప్రకాశిస్తాడు. లోకమంతా ఎదురు తిరిగినా ఆ ఉపాసకుని ఎదిరించలేదు. అంతటి తితిక్ష కలుగుతుంది. ఇదే పృథ్వీలింగ ఉపాసన.

ఇక రెండవది జలభూతం. మనిషి నిలవటానికి భూమి ఆధారమయితే మనిషి ప్రాణాధారం జలం అని చెప్పాలి. భూమిపై పంటలు పండాలంటే నీరు కావాలి. అందువలనే 'యోऽపాం పుష్పం వేద..' అని మంత్రపుష్పంలో యీ జలం అన్నింటికి ఆధారమని వర్ణింపబడ్డది. 'అగ్నిర్వా అపా మాయతనం ఆయతనవాన్ భవతి.....' అని అగ్నితో ప్రారంభించి, అగ్ని, వాయు, సూర్య, చంద్ర, నక్షత్ర, పర్జన్య సంవత్సరాదులన్నీ పరస్పరం ఒకదానిపై ఒకటి ఆధారపడి మానవ లౌకిక జీవితాన్ని సుఖవంతం చేయుటమే కాక ఆధ్యాత్మిక సాధనా విధానాన్ని కూడా ప్రబోధిస్తున్నది. చల్లని నీరు దాహాన్ని దూరం చేస్తుంది. అవయవాలకు ఆహ్లాదాన్ని

కలిగిస్తుంది. నిర్మలతకు నీటిని ఉదాహరణగా చెప్ప వచ్చును. జలానికి స్నేహం లక్షణం. అంతే కాదు. ఆకారం లేని నీరు ఏ పాత్రలో ఉంచితే ఆ రూపాన్ని పొందుతూంది. ఈ జలాన్ని ఆదర్శంగా గ్రహించిన సాధకుడు నీటివలె, లౌకిక విషయాలపై పరుగులు వేసే మనస్సును భగవంతుని ప్రక్కకు త్రిప్పుకుని, తన సాధనా తీవ్రతచేత పవిత్రమైన తన మనస్సు భగవద్రూపాన్ని ధరించేటట్లు చేసుకుంటాడు. నిర్మలత్వాన్ని సాధిస్తాడు. జలం ప్రవహించిన భూమి అంతా పంటలు పండినట్లు యీ ఉపాసనారుడు వెడలిన ప్రదేశంలో ఉన్న సాధకకోటి హృదయ క్షేత్రంలో శాంతి పంటను పండిస్తాడు. స్నేహంగా అందరితో కలిసిపోతాడు. స్నేహమధురిమ అందరికి రుచి చూపుతాడు. చల్లని మాటలు, చల్లని చూపు, చల్లని స్పర్శతో శరత్కాల చంద్రుడై ప్రకాశించి, అందరికి ఆహ్లాదాన్ని కలిగిస్తాడు. ఇదే జలలింగ ఉపాసన.

మూడవది అగ్నిభూతం. ఆహార పక్వతకు మానవునికి అగ్ని అత్యవసరం. వస్తువు గోచరించాలంటే కాంతి అవసరం. ఆరోగ్యం కావాలంటే సూర్యకాంతి అవసరం. రాత్రి సమయంలో ఏపని చేయాలన్నా దీపం అవసరం. ఇవి బాహ్య అవసరాలు. కాని మనం భుజించిన ఆహారం కూడా లోపల జీర్ణం కావాలంటే 'అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రిత :। ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం॥' నేను ప్రాణుల శరీరంలో జఠరాగ్ని రూపంలో ఉండి, ప్రాణాపానాది పంచ వాయువులతో కూడి భోజ్య పదార్థములను పచనము చేయుచున్నానని భగవద్గీత 15వ అధ్యాయంలో శ్రీ కృష్ణపరమాత్మ వచించినట్లు, వైశ్వానరాగ్ని అవసరం. పైవిధంగా యీ అగ్ని బాహ్యాంతరములలో వివిధ

రూపాలతో, వివిధ రీతులుగ, వివిధ క్రియలను చేస్తుంటేనే యీ మానవుని జీవనయాత్ర సాగుతున్నది. మానవ శరీరంలో వేడి తగ్గితే, చల్లబడితే యిక యీ దేహాన్ని యింట్లో ఉంచరు. ఇదే మరణం. ఈ జ్యోతి కూడా 'అగ్నిః కలా, సూర్యః కలా, చంద్రః కలా, విద్యుత్కలా' అని అగ్ని, సూర్య, చంద్ర, విద్యుద్రూపముగ చతుర్విధమై, బ్రహ్మమునకు గల పాద చతుష్టయములో 'జ్యోతిష్మాన్' అను పాదరూపమై యుండినట్లు ఛాందోగ్యోపనిషత్కథనం. అగ్నిలో సర్వం భస్మీభూతం అవుతాయి. అగ్నికి అపవిత్రత లేదు. అగ్నికి చెదలు పట్టవని సామెత గదా! ప్రపంచ నశ్వరత్వాన్ని మనసా గ్రహించి, వివేకముతో వైరాగ్యమూర్తియై, ఆచార్యుని సన్నిధిని అంతేవాసియై, జితేంద్రియుడై, నియమనిష్ఠలతో సాధనాదుల గావించి, వేదాధ్యయనాదుల నర్థ యుక్తముగా, స్వరయుక్తముగా గ్రహించి, వేదాంతార్గత బ్రహ్మస్వరూపాన్ని శ్రవణ, మనన, నిదిధ్యాసనల ద్వారా తెలుసుకొని, మహావాక్యార్థలను గురు ముఖతః గ్రహించి, సాధకుడై, అనుభవసాగరంలో మునిగి సిద్ధుడై, అగ్నిలాగ తేజోమూర్తియై ప్రకాశిస్తాడు. వాడిని లోకంలోని పాపసమూహం అంటదు. వాడి సన్నిధికి చేరినవారి పాప పంకిలాన్ని భస్మీపటలం చేయగలడు. బ్రహ్మతేజస్సు యిదే. ఇదే జ్యోతిలింగ ఉపాసన.

నాలుగవది వాయుభూతం. వాయువు ప్రతివ్యక్తికి అవసరం. వాయువు ప్రాణాపాన వ్యానోదాన సమాన ములుగా మానవ శరీరంలో పంచవిధములై సంచరిస్తూ, మానవదేహం నిలవటానికి ఆధారం అవుతున్నది. మరల యీ వాయువు పంచ ఉప వాయువులతో కలిసి దేహ సంరక్షణ గావిస్తున్నది. వాయువు పీల్చకుండా క్షణకాలం మానలేడు

మానవుడు. బాహ్యావాయువు బాహ్య శరీరానికి ఉపయోగపడుతున్నది. ఈ వాయువునే రేచక పూరకములద్వారా పీల్చి, వదులుతూ, కుంభిస్తారు. దీన్నే ప్రాణాయామం అంటారు. పైవిధంగా లోపల కుంభింపబడిన వాయువు గుండెల్లోని రక్తాన్ని శుభ్ర పరచి, శరీరారోగ్యాన్నికూడా యిస్తుంది. అలాకాక కుంభకకాలాన్ని అధికం చేస్తారు కొంతమంది. యోగసిద్ధాంతంప్రకారం మానవునిలో షట్ చక్రాలున్నవి వాటినే మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞాచక్రా లంటారు. మూలాధార చక్రం వద్ద చుట్టుకొనిఉన్న ఒక అత్యద్భుతశక్తి ఉన్నది. దానినే కుండలినీ శక్తి అంటారు. ఈ ప్రాణాయామ విధానాన్ని కొన్ని నియమాలతో, గురు సన్నిధిని ఉండి సక్రమంగా చేస్తే, యీ కుండలినీ శక్తి, యీ ఆరు చక్రాలద్వారా ప్రయాణంచేసి, ఆజ్ఞాచక్రంలో ప్రవేశిస్తుంది. ఈ ఆజ్ఞాచక్రంలో అర్ధనారీశ్వరత్వం ద్యోతకం. అనగా మనోహృదయ సమ్మేళనం అని అర్థం. మనస్సును పురుషునిగా అనగా శివునిగా, హృదయాన్ని శక్తిగా అనగా పర్వతరాజపుత్రికయైన పార్వతిగా వర్ణించాయి శాస్త్రాలు. కేవలం మనస్సు అభివృద్ధి చెందితే సంగీత, సాహిత్య శిల్ప, చిత్రలేఖన, కవిత్వాది కళలు లభిస్తాయి కాని, అవి కేవలం లౌకికం కావటంచేత యీర్ష్యాసూయలుమాత్రం నశింపవు. కీర్తి ప్రతిష్ఠలకై తపించటం, కలిగితే పొంగిపోవటం, లేకున్న క్రుంగిపోవటంకూడా తప్పవు. కాని ఆ మనస్సుతో హృదయంకూడా కలిసినప్పుడు యీ సంగీత సాహిత్యాదులన్నీ చిత్కళలై శోభించి, భగవంతునికి సన్నిహితమై, శాంత్యానందాల ననుభవిస్తాడు. 'నిధి చాల సుఖమా? రాముని...' అని రామభక్తుడైన త్యాగరాజువలె హృదయంతో గానంచేసి స్థిర ప్రతిష్ఠను పొందుతాడు. రాగంతో

అనురాగాన్ని నింపుతాడు. ఆ యనురాగాన్ని హృదయానికి అందిస్తాడు. అట్టి హృదయాన్ని భగవదర్పణం చేస్తాడు. ఇది మనో హృదయ సమ్మేళన రహస్యం..ఈ మేళనంలో ఆధ్యాత్మిక విజ్ఞానం ప్రకాశిస్తుంది. అందులో ధనకాంక్ష లేదు. కీర్తికాంక్ష లేదు. ఈర్ష్యాసూయలు లేవు. కామక్రోధాదు లంత కంటెలేవు. ఉన్నదొక్కటే. అదే శాంతి! ప్రశాంతి! ఎన్నో రహస్యాలున్నవి యిందులో.

పైవిధంగా సర్వాధారమైన వాయువును అందరూ ఆహ్వానిస్తారు. చల్లని గాలిని అందరూ ఆస్వాదిస్తారు. ఈ శరీరానికి ప్రాణవాయువు అవసరం. ఈ వాయు సంచలనానికి భగవంతుడు కారణం. వాయువును ఏదీ అంటదు. వాయువు సర్వత్ర సంచరిస్తుంది. అట్లాగే వైరాగ్య సంపన్నుడైన సాధకుడుకూడా దేశ దేశాలలో పరివ్రాజకుడిగా సంచరిస్తాడు. గాలి అనేక కుసుమములనుండి పరిమళాన్ని గ్రహించినట్లు యీ సాధకుడు కూడా అనేకమంది మహాత్ముల నాశ్రయించి అనేక ఆధ్యాత్మిక విషయాలను తెలుసుకుంటాడు. వాయువు సుగంధాన్ని ఎక్కడెక్కడికో తీసుకొని వెళ్లి, వెదజల్లినట్లుగా యీ సాధకుడుకూడా తాను సాధించిన అనుభవజ్ఞానాన్ని కూడా జాతి, మత, కుల, దేశ భేదములులేక అందరికి అందిస్తాడు. వాయువును ఎల్లరూ ఆహ్వానించినట్లే ఆ మహాత్ముని కూడా సర్వులూ హృదయ పూర్వకంగా ఆహ్వానిస్తారు. వాయువు నేదీ అంటనట్లు ఆ మహనీయునికూడా లోకములో నేమీ అంటవు. ఇది వాయు లింగ ఉపాసన.

చివరిది ఆకాశభూతం. ప్రాణులు నివసించటానికి అవకాశం యిచ్చేది ఆకాశం. 'ఆకాశం గగనం శూన్యం' అన్నది శాస్త్రం. ఈ ఆకాశానికి సన్నిహితమైనది ఆత్మ. అందుచేతనే 'ఆత్మనః ఆకాశస్సంభూతః'

ఆత్మనుండి ఆకాశం కలిగిందన్నారు. ఎలా అనేది వేదాంతం చెప్తుతుంది. ఆకాశం నీలంగా ఉంటుంది. నీలం దగ్గరగా ఉన్నట్లుండి దూరాన్ని సూచిస్తుంది. శ్రీకృష్ణ పరమాత్మకూడా నీలమేఘ శరీరుడే. నల్లని మబ్బును చూడగానే నెమలి ఆనందంతో నృత్యం చేసినట్లుగా శ్రీకృష్ణ పరమాత్మ అనే నీలిమబ్బు హృదయంలో ఏర్పడినప్పుడు భక్తుని హృదయం అనే మయూరంకూడా ఆనంద నృత్యం సలుపుతుంది. ఆకాశం విశాలమైనది. అదే విధంగా యీ ఆకాశభూత లింగార్చనా రతుడుకూడా యీ విశాల ప్రపంచంలో, విశాల దృష్టితో, విశాల మనస్సుతో, విశాల హృదయంతో నిశ్చింతగా విహరి స్తుంటాడు. సంకుచితత్త్వం అంటే అతడికి తెలియదు. విశాలత్వంలో ఆనందమే అంతా! ఆ విశాల హృదయంలో అందరికీ స్థానం ఉన్నది. ఆ విశాలాధ్యాత్మిక సంపదకు వారసుడౌతాడేమో! ఇది ఆకాశలింగోపాసన.

ఇక యీ ప్రతిమా, ప్రతీకోపాసనల తర్వాత మూడవది అహంగ్రహోపాసన. ఇది నిర్గుణ, నిరాకార, నిరవయవ బ్రహ్మస్వరూప గ్రహణం అని అర్థం. ఇది అందరికి సాధ్యంకాదు. అందుచేతనే 'క్లేశోఽధిక తర స్తేషా మవ్యక్తాసక్తచేతసాం' అంటారు ద్వాదశో ధ్యాంలో కృష్ణభగవానుడు. పూర్వజన్మ సుకృతం ఉండాలి. ధీ శక్తి విజృంభించాలి. త్యాగం పొర్లి ప్రవహించాలి. సత్యగుణం సంపూర్తిగా రావాలి. దయా దాక్షిణ్యాది శుభలక్షణాలు వికసించాలి. అస్ఖలిత బ్రహ్మచర్యం ఉండాలి. స్వార్థం నశించాలి. లోకంలో ఉన్న సద్గుణ సంపద అంతా మూర్తీభవించాలి. అనుభవజ్ఞుడైన సద్గురువు లభ్యం కావాలి. కష్టత రమైన సాధన సాగించాలి. గురుముఖతః మహా వాక్యచతుష్టయార్థాన్ని గ్రహించాలి. అనుభవం పొందాలి. ఏ సాధనలు లేకుండా 'అహంబ్రహ్మాస్మి'

అంటే 'బ్రహ్మ' ఎగిరిపోయి, 'అహం' పెరిగి, తగాదాలు అధికం అయిఉన్న శాంతికూడా అంతర్ధానం అవుతుంది.

అందుచేతనే 'శాస్త్రాణాం చ కళానాం చ లౌకికానాం గురోస్థితా। ఇంద్రియాతీత విషయాః కథం ప్రాప్యా గురుంవినా॥' లౌకికమైన శాస్త్రాలకు, కళలకు గురువు అవసరం అయినప్పుడు యిక యింద్రియాతీతములైన బ్రహ్మవిషయములు గురువు లేకుండా ఏవిధంగా సంప్రాప్తిస్తాయి - అన్నట్లుగా యీ మార్గంలో గురువు అత్యవసరం. 'శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం' శాస్త్రజ్ఞాన అనుభవజ్ఞాన నిష్ణాతుడైన గురువునే చేరాలి. ఈ రోజులలో అసలు శిష్యులే లేరేమో! శ్రీ రామకృష్ణ పరమహంస దేవుని శిష్యుని వద్దకు ఒక కుర్రవాడు వస్తుండేవాడు. ఒకరోజు ఆ అబ్బాయి 'స్వామిజీ! శిష్యలక్షణాలు ఏమిటి?' అని అడిగాడు. శ్రీ స్వామిజీ చక్కగా చెప్పారు. విని మరల 'స్వామిజీ! గురు లక్షణాలు?' అన్నాడు ప్రశ్నకు శ్రీ స్వామీజీ చిరునవ్వుతో సమాధానం చెప్పారు. వెంటనే ఆ కుర్రవాడు జంకులేక 'అయితే నేను గురువుగానే ఉంటాను' అన్నాడు. కాని యథార్థ శిష్యత్వంలోనుండి యథార్థ గురుత్వం వస్తుందనేది పరమ సత్యం. ఆ గురు శిష్యపరంపరే మన భారతీయాధ్యాత్మిక విజ్ఞానానికి పట్టుగొమ్మ. 'ఇతి శుశ్రుమ పూర్వేషాం' యీ విధంగా మా పూర్వుల నుండి విన్నాం అంటుంది ఉపనిషత్తు. 'ఏవం పరంపరా ప్రాప్తం' అంటుంది గీత. ఆ పరంపరయే మన వైభవాన్ని దేశవిదేశాలలో ప్రచారంచేసి, అనేక మందికి విజ్ఞానభిక్షను ప్రసాదించింది. మన వేదాంత ధ్వజాన్ని ఎగురవేసింది. ఇటువంటి గురు పరంపరద్వారా నేర్చుకొనవలసినది యీ అహంగ్రహోపాసన.

పైన ప్రతీకోపాసనలో పంచభూతస్వరూపుడైన శివుని పంచ లింగోపాసనా విధానం గ్రహించాము. శివ శక్తులంటాముగదా! శక్తివిషయం గ్రహించాలి యిక. శక్తి జ్ఞానం వినా దేవి నిర్వాణం నోపలభ్యతే' శక్తి జ్ఞానములేక మోక్ష మలభ్యమనిగదా తంత్ర వాక్యము. శివుడు ప్రమథగణములతో కూడి ఉంటాడన్న విషయం అందరికి తెలిసినదే. అదే శక్త్యారాధకుడైతే 'ప్రమథ' అనే అక్షరత్రయంలో చివరనున్న 'థ' అనే అక్షరాన్ని, 'ప్ర', 'మ' అనే అక్షరాలకు మధ్య నుంచి అన్నింటిలో ప్రథముడౌతాడు. మోక్షకారణ మైన యీ శరీరాన్ని ప్రసాదించిన తల్లి ప్రథమశక్తి. అక్షరాభ్యాస సమయంలో 'సరస్వతీ నమస్తుభ్యం' అని ప్రార్థింపబడిన ఆ చదువులతల్లి ద్వితీయ శక్తి. ఉపనయన సమయంలో 'ఓం భూర్భువస్సువః' అనే గాయత్రీమంత్రాన్ని గ్రహించి, అజ్ఞాన నిర్మూలనార్థం జపింపబడిన ఆ తల్లి తృతీయశక్తి. ఈమెయే జ్ఞానశక్తి. ఉపనయనానంతరం అరణ్యాలలో వానప్రస్థులైన గురువులవద్ద అంతేవాసిగానున్న సమయంలో తల్లిని మరిపించి, మురిపించి, యోగక్షేమాల విచారించి, వాత్సల్యంతో ప్రతిదినం భోజనంపెట్టే గురుపత్ని చతుర్థశక్తి. గురువులచేరి, భక్తితో శుశ్రూషచేస్తూ, తమ జీవిత వికాసానికై, సుస్వరయుక్తంగా అధ్యయనం చేయబడిన వేద జనని పంచమశక్తి. ఈ విధంగా పసితనంనుండి మానవ జీవితానికి శక్తియే సారథ్యం వహించిందని సువ్యక్తం. ఈ శక్తి పంచకాన్ని సక్రమంగా అర్థంచేసుకుని యీ లోకంలో వ్యవహరిస్తే అన్నింటిలో ప్రథమ స్థానమే.

శ్రద్ధ లోపిస్తే అధముడు కాగలడు. కన్నతల్లికి గౌరవస్థానమునిచ్చి, మనస్సును, వికసింపజేసే విద్యను వినయవిధేయతలతో గ్రహించి, దేవతగా

భావించి, విచక్షణా జ్ఞానాన్ని, విజ్ఞానాన్ని అను గ్రహించే గాయత్రీమాత మంత్రానుష్ఠానంచేసి, ఆయురారోగ్య సద్గుణాభివృద్ధికి సాత్వికాహారాన్ని వండిపెట్టి, మాతృమూర్తివలె పోషించిన గురుపత్ని ఆశీర్వాదబలంతో, విజ్ఞానఖనియైన వేదమాత అను గ్రహంతో, గురుపుంగవుని కృపాకటాక్షవీక్షణంతో అధికారియైన మానవుడు జగజ్జనని దర్శనానికై ఆవేదన చెందాలి. అసలు శాక్తేయం యిక్కడనుండి ప్రారంభం అవుతుందనవచ్చును. పైన చెప్పిన సల్లక్షణాలు లోపించి 'నేను శాక్తేయుడిని' అంతే

ప్రయోజనం శూన్యం. ఈ శాక్తేయంలో తల్లిబిడ్డల పవిత్ర సంబంధంతప్ప అన్యంలేదు. ఈ పవిత్ర సంబంధాన్ని హృదయంతో అర్థం చేసుకుని, తన వయస్సునుకూడా మరచి, I am the Child of the Divine Mother అని శ్రీరామకృష్ణ దేవుడు వచించినట్లు ఆ జగజ్జనని ఒడిలో నిశ్చింతగా ఉండటమే శక్త్యారాధనయందలి ధ్యేయం. అదే గమ్యం. సకల బాధ్యతలను ఆ తల్లియే వహిస్తున్నప్పుడు యీ భక్తునికి చింత ఎందుకు? భక్తుడు భగవతిని అందుకొనుటకు ప్రయత్నించటమే సాధన. విసుగు, విరామంలేక యత్నించి యత్నించి, చివరికి పట్టు కుంటాడు ఆమెను. సాధారణంగా బిడ్డ తల్లిని పట్టుకున్నట్లు భక్తుడుకూడా భగవతిని పట్టుకుంటాడు. ఇది సామాన్యమే. కాని తల్లి బిడ్డను పట్టుకొనటంలో బిడ్డకు భయంలేని విధంగా భక్తుడు భగవతిచేత పట్టుకొనబడిన యిక జన్మమృత్యుజరాభయము లుండవు. ఇతర సాధనావిధానములకంటె యీ శాక్తేయసాధనలోని ప్రత్యేకత యిదే! ఆమె విశ్వజనని! ఆమె విశ్వారాధ్య! ఆమె విశాల హృదయ! ఆమె విశాలాక్షి! ఆమె అనుగ్రహిస్తే అంతా ప్రేమమయంగా

గోచరిస్తుంది. శక్త్యారాధకుడు పంచాయతనపూజా విధానంలో అంబికను మధ్యలోనుంచి, ఆరాధన సాగించి మంగళకరుడు అవుతాడు.

ఇంత విశాల ప్రపంచాన్ని నిర్మించిన ఆలోకమాత ఎటువంటిదో, ఆ తల్లి ఎంత సుగుణరాశియో, ఎంత రూపసంపద కలదో, ఎంత ప్రేమమూర్తియో, ఎంతమంది భక్తులను రక్షించిందో, ఎంతమందికి సాక్షాత్కరించిందో అని అనేక భావనలు కలిగి, ఆలోచించి అనేక గ్రంథాలను చదువుతాడు, అనేక శాస్త్రాలను శ్రవణంకూడా చేస్తాడు యీ మానవుడు. కాని అంతమాత్రంచేతనే అనుభవం ప్రాప్తించదు. పిండివంటల పుస్తకం కొని, ఎన్ని పర్యాయాలు చదివినా ఆకలి నివారణకానట్లే యీ గ్రంథం జ్ఞానంకూడా అంతమాత్రమే. సంగీత, సాహిత్య కవిత్వాదులన్నీ సాధన చేస్తేనే అభివృద్ధి చెందుతాయి. అదేవిధంగా గ్రంథ పఠనంలో గ్రహించుకున్న విషయాల్ని ఆచరణలోపెట్టాలి. ఈ సాధనలేనిచో ఏదీ సిద్ధించదు. ఆధ్యాత్మిక జీవితంలో యీ సాధన అత్యవసరం అని మహాపురుషుల హెచ్చరిక.

లలితాసహస్రనామంలో ఆ జగదంబ బాహ్య రూపవర్ణనలేకాక అనేక అంతర రహస్యాలు యిమిడి ఉన్నవి. 'శ్రీమాత్రే నమః' అంటూ మొదటి నామంలోనే ఆ పరాశక్తిని తల్లిగా తెలిపి, సన్నిహితమైన తల్లిబిడ్డల సంబంధాన్ని నిరూపించింది. దేవకార్యార్థం అవతరించింది. ఎక్కడ? చిదగ్నికుండ సంభూతగా. అంటే ఎవరి హృదయంలో 'చిత్' జ్ఞానమనే అగ్ని రగుల్కొంటుందో అక్కడ అని అర్థం. కావుననే ఆమె జ్ఞానరూపిణి. ఆమె చతుర్బాహువులతో, అరుణకాంతితో, సౌమ్య మూర్తియై, చిరునవ్వుతో ప్రకాశిస్తుంది. ఆమె సకలాలంకార

భూషితయై, ఆయాభరణాలకే శోభను కలిగిస్తున్నది. తన క్రీగంటి చూపుతో చరాచర సృష్టిని చేయగల ఆదిపరాశక్తి ఆమె. ఆ చూపుతోనే సకల గణేశ్వరుని కూడా సృష్టించింది. ఆమె శరచ్చంద్ర సమానమైన ముఖం కలిగిఉన్నది. ఆ తల్లి పరమపావనమూర్తి. మంగళప్రదాత్రికాన ఆమె సర్వమంగళ. ఆమె నాదస్వరూపిణి. ఆమె భక్తులకు కల్పవృక్షం. ఆమె వేదజనని. ఆమె భక్తజనచింతామణి. ఆమె నారాయణి. ఆమె బ్రాహ్మీశక్తి. ఆమె శర్వాణి. ఆమె గాయత్రి ఆమె తపస్సంపన్నులకు ఆరాధ్యదైవం. ఈ విధమైన అనేక వర్ణనలు ఆమె బాహ్యరూపాన్ని, ఆమె శక్తితత్వాన్ని తెలుపుతున్నవి.

'మూలాధారైకనిలయాయై నమః', మూలాధారాంబుజారూఢాయై నమః' అని మూలాధార చక్ర నివాసినిగా, 'స్వాధిష్ఠా నాంబుజగతాయై నమః' అని స్వాధిష్ఠాన చక్రాంతరస్థగా, 'మణిపూరాంతరుదితాయై నమః', 'మణిపూరాబ్జ నిలయాయై నమః' అని మణిపూరకచక్రనిలయగా, 'అనాహతాబ్జ నిలయాయై నమః' అని అనాహతచక్రవాసినిగా, 'విశుద్ధిచక్ర నిలయాయై నమః' అని విశుద్ధచక్ర నిలయగా, 'ఆజ్ఞాచక్రాంతరాళస్థాయైనమః' అని ఆజ్ఞాచక్రాంతరాళగా ఆ తల్లిని యోగసిద్ధాంతరీతిగా షట్చక్రములను, ఆయా అధిష్ఠానదేవతలతోకూడ వర్ణించింది లలితాసహస్రం. మరియు నామె షట్చక్రములకు పైనగల సహస్రార చక్రంలో నివసిస్తూ, అప్పుడప్పుడు మూలాధారచక్రం వరకు వస్తూ, ఆయా స్థానాలలో తాను ఉన్న సమయంలో ఆహార, విహార, ఆయుధ, రూప, నామాల నన్నింటిని మార్చుకుంటూ సాధకులకు ఆయా అనుభూతులను ప్రసాదిస్తుంది. ఇవి బాహ్యదృష్టికి అగోచరం. ఇవన్నీ అంతర్ముఖ సాధనలో సాక్షాత్కరిస్తాయి. ఇది అంతర్ధ సాధనావిధానం.

ఇక అద్వైతపరంగా 'నిరాధారాయై నమః', 'నిరంజనాయై నమః', 'నిర్గుణాయై నమః', 'నిర్వికారాయై నమః', 'నిరాశ్రయాయై నమః', 'నిత్యాయై నమః', 'నిత్య శుద్ధాయై నమః', 'బ్రహ్మరూపాయై నమః' అని అనేక నామాలలో వర్ణింపబడ్డది.

పైవిధంగా క్రమవిధానంలో సాధన చేసినవాని దుర్గుణాలను నశింపజేసి, ముక్తిని ప్రసాదిస్తుందని 'మదనాశిన్యై నమః', 'మోహనాశిన్యై నమః', 'మమతాహంత్ర్యై' నమః, 'పాపనాశిన్యై నమః', 'భవనాశిన్యై నమః', 'ముక్తినిలయాయై నమః' అని యీ నామాలలో వ్యక్తం అయినది.

ఆ తల్లిని తంత్ర, మంత్ర, యంత్రాత్మికగా 'మహా తంత్రాయై నమః', 'సర్వ తంత్ర రూపాయై నమః', 'మహా మంత్రాయై నమః', 'మహామంత్ర స్వరూపిణ్యై నమః', 'మహాయంత్రాయై నమః', 'మహాయంత్రాత్మికాయై నమః' అను నామాలు వర్ణించాయి.

అసలు యీ తంత్ర, మంత్ర, యంత్రార్థాలను తెలుసుకోవాలి ముందుగా. ఈ శక్త్యుపాసనావిధానం వేదజనితమై, ఉపనిషత్తుల వికసించి, ఆగమ రూపంలో పరిణమించి, తంత్రశాస్త్రమై ప్రకాశించి, కఠినమైన మానవ హృదయాన్ని మృదువుగా, కల్మష హృదయాన్ని నిర్మలంగా, అపవిత్రతను పవిత్రంగా మార్చి, మానవ సంఘంమధ్య అతి సన్నిహితంగా ప్రవేశించి, అపూర్వమైన సంబంధాన్ని సృష్టించి, ఆనందాన్ని ప్రసాదించిందనవచ్చును. వేదాలు ఆ శక్తిని ఆద్యశక్తిగా, అదితిగా అభివర్ణించాయి. బహ్వృచ, దేవీ, సీత, సరస్వతీరహస్య త్రిపురతాపిన్యాది ఉపనిషత్తులు ఆలోకేశ్వరిని సృష్టి స్థితి లయ కారిణిగా, పార్వతిగా, మహాలక్ష్మిగా, త్రిగుణాత్మికగా, గాయత్రిగా, త్రిపుర సుందరిగా, దుర్గగా,

శ్రీదేవిగా, భువనేశ్వరిగా, బాలగా వివరించి, మానవు లకు అతి సమీపానికి తీసుకొని వచ్చాయి. అందు చేతనే 'తద్దూరే తద్వదంతికే' అజ్ఞానులకు దూర మనియు, విజ్ఞానులకు దగ్గర అనియు ఉపనిషద్వా క్యము. ఈ ఉపనిషచ్ఛక్తి శివుని శరీరమున ప్రవే శించి, అర్ధ భాగమై, శివుని ముఖతః అతి ముఖ్య విషయముల శ్రద్ధతో నాలకించి, 'ఆగతం శివవ క్త్రాచ్చ గతం చ గిరిజాశ్రుతిం మతం చ వాసుదేవస్య' అనురీతి ఆగమత్వము నొందినది. అంతేకాక 'మతం చ వాసు దేవస్య' అని వైష్ణవాన్ని, 'ఆగతం శివవక్త్రాచ్చ' అని శైవాన్నికూడా కలుపుకుని సమన్వయం గావించి, ప్రతిమ ప్రతీకోపాసనల రహస్యాన్ని అందించి, తాను సూక్ష్మరూపంలో సర్వ చరాచర జీవకోటిలో వ్యాప్తమై, శక్తిరూపాన్ని ధరించి, విశ్వమాత అయింది. ఇదే శాక్తేయం అయింది. ఈ తంత్రములు వైష్ణవ, శైవ, శాక్త, గాణాపత్యాది రూపములతో అనేకవిధములుగా పరిణమించాయి. ఈ తంత్రరూపంలో మనస్సుకు విజ్ఞానాన్ని వివరంగా అందించింది ఆ మహాజనని. 'తనోతి విపులానర్థాన్ తత్త్వమంత్ర సమన్వితాన్, త్రాణంచ కురుతే యస్మా త్తంత్రమిత్యభి ధీయతే॥ తత్త్వమంత్ర సమన్వితమై విపులార్థముల దెలిపి రక్షించుటచే తంత్రమను పేరు సిద్ధించినట్లు కామికాగమ తంత్ర నిర్వచనము. ఈ తంత్రాలలో ఎక్కడా కుతంత్రం లేదు. కాని మానవుడు వీనిని అపసవ్యంగా ఉపయోగించి, తన స్వార్థానికై అపమార్గం లోకిదించి, యీ తంత్రాలకు అనర్థం కల్పించి, కుతంత్రంగా మార్చి ఉంటాడు. ఈ తంత్రములు బహుళములు. దిగితేగాని లోతు తెలియనట్లుగా యీ తంత్ర విజ్ఞానసాగరంలోకి ప్రవేశిస్తేగాని దీని ప్రాశస్త్యం అవగతంకాదు. అందుచేతనే ఆ తల్లి 'మహాతంత్రాయై నమః',

సర్వతంత్రరూపాయై నమః' అని కీర్తింపబడ్డది. ఇది ఆమె తంత్రరూపం.

ఇక ఆమె మంత్రరూపం. మంత్రములనేకం. ఆదేవి నవకోటి మంత్రములకు ఆరాధ్యమైనది. మంత్రాలతో ఆమెను పూజించాలి. మంత్రమూలంగా ఆమెను ప్రార్థించాలి. మంత్రోచ్చారణ చేయాలి. మంత్రజపం చేయాలి. మంత్రార్థాన్ని గ్రహించాలి. మంత్ర అధిష్ఠానమూర్తిని తెలుసుకోవాలి. తన తత్త్వానికి సరిపోయే మంత్రాన్ని సకలానుభవ స్వరూపుడైన గురువునుండి ఉపదేశం పొందాలి. పుస్తకాలలో యిచ్చిన మంత్రాల నన్నింటిని చదివి, ఏదో ఒక సమయంలో ఏదో ఒక మంత్రాన్ని వీలున్నప్పుడు మంత్ర జపం చేయరాదు. ఎన్ని కోట్లు చేశామనికాదు. ప్రపంచ విషయాలకు ఎంత దూరమయ్యాము, దైవానికి ఎంత సన్నిహితమయ్యాము అనేది పరిక్షించుకుంటూ ఉండాలి. క్రమ పద్ధతిలో, అర్థయుక్తంగా మంత్రాచరణ లేనప్పుడు కాశీ ప్రయాగ లలో అక్షరలక్షలు చేసినా వ్యర్థమే. అందుచేతనే 'మంత్రార్థం మంత్రచైతన్యం యో న జానాతి సాధకః! శతలక్ష ప్రజప్తేపి తస్యమంత్రో న సిద్ధ్యతి॥' మంత్రార్థాన్ని, మంత్రాధిష్ఠదేవతను, తెలియని సాధకుడు కోటి జపం చేసినా వానికి మంత్ర సిద్ధి కలుగదని మహానిర్వాణతంత్రోపదేశం. 'మననాత్ త్రాయతీతి మంత్రః' అని నిర్వచనం. మననం అనగా జపం చేసినవానిని రక్షిస్తుందని అర్థం. మంత్రం సత్త్వగుణాభివృద్ధిని సూచించాలి. తామసిక, రాజసిక లక్షణాలను నశింపచేయాలి. అధిష్ఠాన మూర్తిని, తమోగుణంతో జపిస్తే తామసికమూర్తిగా, రజోగుణంతో జపిస్తే రాజసిక మూర్తియై గోచరిస్తుంది. నిగ్రహంతో జపిస్తే అనుగ్రహమూర్తియై సాక్షాత్కరిస్తుంది. నిర్భయంగా జపిస్తే అభయ మూర్తియై భయాన్ని

దూరం చేస్తుంది. ప్రేమతో జపిస్తే ప్రేమ మూర్తియై రక్షిస్తుంది. బిడ్డవై జపిస్తే, తల్లిగా నిలిచి, తన వాత్సల్యామృతాన్ని అందిస్తుంది. 'యం భావం దర్శయే ద్యస్య తం భావం స తు పశ్యతి' ఎవడు ఏ భావంతో దర్శిస్తాడో ఆ భావాన్నే చూస్తాడుగదా! అందుచేత సాధకుడు తన యిష్టదైవమంత్రాన్ని బీజాక్షరసహితంగా అనుభవజ్ఞుడైన గురువునుండి ఉపదేశాన్ని పొంది, శ్రద్ధాభక్తులతో జపించి, తన భావనకనుగుణమైన రూపాన్ని దర్శిస్తాడు. సాధకునిలోనే భేదంగాని భగవతిలో లేదు. సత్త్వగుణాధిక్యతగల సాధకుడు ఆ లోకేశ్వరిని సాత్వికమూర్తిగనే దర్శిస్తాడుగదా!

ఈ సాధన విషయంలో, ఆధునికులలో శ్రీరామకృష్ణ పరమహంసదేవుడు. సుప్రసిద్ధుడనకతప్పదు. పసి మనస్సుతో, పసి హృదయంతో, మూర్తీభవించిన పసితత్వం రామకృష్ణునిది, ఆయన ఆరాధ్యదైవం కాలరూపిణియైన కాళికాదేవి, ఆమె బాహ్యరూపం భయంకరంగా ఉంటుంది. ఆమె దిగంబరి. ఆమె వక్షస్థలంపై కపాలమాల వ్రేలాడుతూ ఉంటుంది. ఒక హస్తంలో మానవశిరస్సు. ఒక చేతిలో ఖడ్గం ఎర్రని పొడవైన నాలుక బయటికి చాచి ఉంటుంది. ఆమె త్రినేత్రి. స్మశానవాసియై, జడ సమానుడైన శివుని వక్షస్థలమున ఒక పాదమునుంచి ఉన్నది. ముఖంలో చిరునవ్వు నాట్యం చేస్తున్నది. ఒక చెయ్యి భక్తులకు అభయం యిస్తున్నది. ఈ బాహ్యరూపం సామాన్యులకు అతి భయంకరంగా గోచరిస్తున్నది. కాని ఆ తల్లి యీ బాహ్యగుణాలకు అనేక అంతరార్థములున్నవి. ఆమె దిగంబరత్వంలో విశ్వవ్యాపకత్వం ఉన్నది. ఆమె కపాలమాలలో ఏబది పుర్రెలున్నవి. అవి ఏబది అక్షరాలకు ప్రతీక.

ఒక్కొక్క శిరస్సు అకారాది క్షకార పర్యంత అక్షరాలను ఒక్కొక్కటిగా ఉచ్చరిస్తూ ఉంటాయి. అకార ఉకార మకార సంయుతమైన ఓంకారనాదం శ్రవణగోచరం అవుతుంది. అంటే ఆమె నాదస్వరూపిణి. అందు వలననే 'నాదరూపిణ్యై నమః' అని, 'సామగాన ప్రియాయై నమః' అని లలితాసహస్రం ఆ తల్లిని కీర్తించింది. దుష్ట శిక్షణను సూచిస్తుంది మానవ శిరస్సు. దుష్ట శిక్షణార్థం ఆమె కత్తిని ధరించింది. భక్తుల పాపాలను భస్మం చేస్తుంది ఆమె 'మూడవ నేత్రం. శివుని నివాసమైన స్మశానం వైరాగ్య చిహ్నాం. ఆయన జడత్వం సమాధి స్థితిని తెలియజేస్తుంది. ఆ సమాధియే జ్ఞానలక్షణం. జ్ఞానశక్తి స్వరూపుడైన శివుని హృదయంనుండి ఇచ్ఛాశక్తిగా పరిణమించిన ఆలోకమాత క్రియాశక్తియై సర్వ సృష్టికార్యాన్ని చేస్తున్నది. ఆమె చాచిన పొడవైన నాలుక ఆమె సంహారశక్తిని స్ఫురింపజేస్తున్నది. కాని శ్రీరామకృష్ణుని దృష్టిలో వీటన్నింటికి స్థానం లేదు, ఆయన చూచింది ఆమె పెదవులపైనున్న ఆ తల్లి చిరునవ్వునే!, ఆయన చూచింది ఆ తల్లి అభయ హస్తాన్ని మాత్రమే! ఆయన తిలకించింది ఆమె నేత్రాలలోని కరుణను మాత్రమే. ఆయన వీక్షించినది ఆమె హృదయంలో పొంగి ప్రవహిస్తున్న వాత్సల్య సుధను మాత్రమే! అందుచేతనే ఆ ప్రేమమయి దర్శనం పొందాలని తీవ్రంగా కాంక్షించాడు. ఆ కాళికాదేవి సన్నిధిలో పూజచేశాడు కొంతకాలం. పూజాదుల మరచి కీర్తించాడు మరికొంతకాలం. కీర్తించటంకూడా మరచి సదా స్మరించాడు. స్మరణ మరచి జపించాడు. జపమంత్రాన్ని మరచి ధ్యానించాడు. ఆవేదనతో ప్రార్థించాడు. నేలపైపొర్లి దుఃఖించాడు. తలను నేలపై కొట్టుకొని విలపించాడు. ఆ తల్లికై తపించి పోయాడు. ఆయన కన్నీరు కాల్వలుగా ప్రవహించాయి. ఇక తట్టుకోలేకపోయాడు. భగవత్సాక్షాత్కారంలేని జన్మ

నిరర్థకం అని భావించాడు. అతివేగంగా దేవాలయం లోకి పరుగువేశాడు. దేవి సన్నిధిని నిలిచాడు. ప్రక్కనే గోడకు వ్రేలాడుతున్న ఖడ్గాన్ని అందుకున్నాడు. ఆ తల్లిని చూచాడు. నమస్కరించాడు. తన శిరస్సును భగవతికి అర్పించటానికి సంసిద్ధుడయ్యాడు. ఇది ఆ లోకమాతకై పసిబిడ్డవలె తపించిన శ్రీరామకృష్ణ దేవుని తపన.

ఇక బిడ్డను రక్షించవలసిన సమయం ఆసన్న మైంది. ఇంతవరకు తల్లికై బిడ్డ తపన. ఇప్పుడో బిడ్డకొరకు తల్లి బాధ్యత, ఆ మాతృహృదయం కరిగిపోయింది. ఆ కత్తి ఎత్తిన చేతిని మృదువుగా పట్టుకున్నది ఒక చల్లని హస్తం. ఆ తల్లియే జగన్నాటక సూత్రధారిణి! ఆ తల్లియే లోకశాసని! ఆ తల్లియే భక్త రక్షిణి! ఆ తల్లియే లోకపావని! ఆమెయే కాళికామాత! కోటి సూర్యకాంతితో ప్రకాశిస్తున్న ఆ దివ్యమూర్తిని చూచాడు రామకృష్ణుడు. ఆయనకు భయం కలగ లేదు. పసివాడు తన తల్లిలో ప్రేమనే చూస్తాడు, వాడికి తన తల్లి సర్వ వేళలా ప్రేమ మూర్తిగానే కనిపిస్తుంది. అదేవిధంగా పసి తత్త్వంతో నిండి నిబిడీ కృతమైన రామకృష్ణుని పసి హృదయంలో ఆ తల్లి మాతృప్రేమయే స్థిరంగా నిలిచిపోయింది. భయం దూరమైంది. ఆ చల్లని స్పర్శకు పులకించి పోయారు. ఆనందబాష్పాలు ప్రవహించాయి. తనను తాను మై మరిచి పోయాడు. తన యిష్టదైవ సందర్శన భాగ్యం వలన ఆయనకు ఆనందం. ఈ లోకంలో జన్మించినా లోకవిషయాల నంటని పవిత్రహృదయుడైన తన బిడ్డయొక్క భక్తిని, విరాగాన్ని చూచిన జగజ్జనని కెంత ఆనందమో! ఆ ఆనందం వర్ణనాతీతం.

సాత్త్వికగుణంతో, సాత్త్విక కర్మతో, సాత్త్విక భావనతో, సాత్త్వికారాధనతో, సాత్త్వికమూర్తియైన రామకృష్ణుడు,

బాహ్యమునకు భయంకరమూర్తిగా దోచు కాళికా దేవిని సాత్త్విక మూర్తిగా సాక్షాత్కరింపజేసుకొని, సత్త్వగుణఫలితమైన పవిత్రతను అందు కున్నాడు. పవిత్ర శరీరంలో, మూర్తీభవించిన పవిత్ర మూర్తియై, పవిత్రదృష్టి, పవిత్రభావన, పవిత్ర స్పర్శ, పవిత్ర బోధలద్వారా తన శిష్యులకు పవిత్రతను ప్రసాదించి, పవిత్ర గురువరేణ్యుడై, సర్వమత సమన్వయావతా రుడై సర్వదేవదేవీస్వరూపుడై, సాధనావతారమై జగద్వంద్యుడయ్యాడు. అందుచేతనే 'మహామంత్ర స్వరూపిణ్యై నమః', 'మహామంత్రాయై నమః', 'మం త్రసారాయై నమః' అని లలితా సహస్రనామ వర్ణన. ఇది ఆ తల్లి మంత్రరూపం. ఇది మంత్రానుష్ఠాన రహస్యం.

ఇక యంత్రవిషయం. ఒక్కొక్క దేవతకు ఒక్కొక్క మంత్ర మున్నట్లు ఒక్కొక్క దేవతకు ఒక్కొక్క యంత్ర మున్నది. ఆ యంత్రంలో, ఆ దేవతకు సంబంధించిన బీజాక్షరాలుంటాయి. మంత్రంవలె యంత్రంకూడా బీజాక్షరయుతమై ఉంటుంది. మంత్రా లనేకం. అదేవిధంగా యంత్రాలుకూడా అనేకం. లక్ష్మీయంత్రం, దుర్గాయంత్రం మొదలైనవి ఉన్నవిగదా! దేవాలయాలలో దేవుని ప్రతిష్ఠించే సమయంలో ఒక రాగి రేకుపై, వెండిరేకుపై, లేక బంగారురేకుపై, బీజాక్షరాలను లిఖిస్తారు. అదే యంత్రం అవుతుంది. ఆ యంత్రాన్ని దేవుని ప్రతిష్ఠించే పీఠస్థానంలో ఉంచుతారు. దీన్ని ప్రాణ ప్రతిష్ఠ అంటారు. దేవీ పీఠాలకు ముందు శ్రీ చక్రంకూడా ఉంటుంది. ప్రతిష్ఠకుముందు ప్రతిమను జడరూపంగా భావిస్తారుకాని ప్రాణప్రతిష్ఠానంతరం చిన్మయంగా భావించి, పూజించి, నమస్కరించి, నివేదనాదికాలను నిర్వహిస్తారు. యంత్ర రహస్యాలు బాగా తెలిసి చేయాలి. కేవలం పాండిత్యంకాక ఆచరణ, ఉపాసనా బలం, పవిత్రత లుండాలి.

అవి లేనిచో దేవాలయానికి ఆకర్షణాభివృద్ధు లుండవు. రహస్యం తెలిసిన వారు కాబట్టి మన ఋషిచంద్రులు తమ తపశ్శక్తినంతా ధారపోసి, దేవా లయాల నిర్మించి, దైవ ప్రతిష్ఠ గావించారు. అందుచేతనే మనప్రాచీన దేవాలయాలు యీనాటికీ చెక్కుచెదర లేదు. ఇది వారి ఉపాసనా శక్తి, మరియు యంత్రశక్తి అనక తప్పదు. అందుచేతనే ఆ తల్లి 'మహాయంత్రాయై నమః', 'మహాయంత్రాత్మికాయై నమః' అని చెప్పబడి, దేవతామూర్తియై విరాజిల్లుతున్నది. ఇది ఆ తల్లి యంత్రరూపం.

మానవజీవితంలోకూడా ఆ జగజ్జనని ఒక మహాయంత్రమే. 'యా దేవీ సర్వభూతేషు చేతనేత్య భిధీయతే' అని సప్తశతి వచించినట్లు యీ అచేతన శరీరంలో చేతనమైన యంత్రం ఆమెయే! చేతనా చేతనరూపిణి ఆమెయే! ఆమె మానవ హృదయంలో ఉంటేనే యీ శరీరానికి విలువ. ఈ చేతనమూర్తిని ఉపాసనాపరంగా గ్రహించాలంటే సద్గురు సమాశ్ర యత్వం కలగాలి శిష్యుడికి. విషయదూరుడైనప్పుడే గురువు శిష్యుని ఆధ్యాత్మిక జీవితానికి ప్రాణప్రతిష్ఠ చేయాలి. అప్పుడే శిష్యుని మనఃఫలకం మీద సూక్ష్మ రూపంలో బీజాక్షరాలను ముద్రిస్తాడు. తర్వాతనే ఆ శిష్యుడు మహోన్నతస్థితి నందుకొని పూజ్యుడు కాగలడు. అనుభవజ్ఞుడైన గురువువల్లనే శిష్యునికి అభివృద్ధి కలుగుతుంది.

ఈ యంత్రం చేతనం. శ్రీరామకృష్ణదేవుడు పంచ కృత్యపరాయణ అయిన కాళికాదేవికి సర్వార్పణ గావించి, 'చేమోడ్చి 'అహంయంత్రం భవాన్ యంత్రీ' అని 'అమ్మా! నేను యంత్రాన్ని నీవు చోదకురాలవు' అంటూ యీ అచేతనమైన శరీర యంత్రాలను నడిపే చేతనయంత్రంగా ఆమెను భావించాడు కాని యీ రహస్యం తెలియక విద్యా

ధన, శరీరబలంతో మునిగిన మానవుడు అహంకారంతో అన్నీ తనవల్లనే జరుగుతున్నవని భావించి గర్వి స్తుంటాడు. ఈ అహంకార నిర్మూలన అయితేగాని శాంతి లభించదు. శాంతిలో అహంకారంలేదు. అహంకారంలో శాంతిలేదు. అహంకారం తగ్గాలంటే మన లోపలున్న చేతనయంత్రదేవతకు జోహారు లర్పించాలిసిందే! కాన మన లోపల ప్రతిష్ఠితమైన యంత్రశక్తిబలంతో మంత్ర శక్తిని గ్రహించి, తంత్ర శక్తిని లోకంలో వ్యాపింపజేయాలి మానవుడు.

పైవిధంగా యీ తంత్ర, మంత్ర, యంత్రాత్మిక మైన దేవీ రూపాన్ని మొదట తంత్ర గ్రంథముల ద్వారా గ్రహించి, యంత్రమూర్తిగా ప్రతిష్ఠించుకొని, మంత్రమూర్తిగా జపించి, బాహ్యాభ్యంతరముల ఆ తల్లిని దర్శిస్తాడు సాధకుడు. నవావరణముల, శ్రీ చక్రార్చనా రహస్యముల గ్రహించి శ్రీమాత అనుగ్ర హాన్ని పొందుతాడు. సిద్ధుడై, మహాత్ముడై, లోకానికి శాంతిని అనుగ్రహిస్తాడు.

ఈ శ్రీమాతను అధిక శ్రద్ధాభక్తులతో అర్చన గావించినవారు దక్షిణదేశమున శ్రీ శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితులు ప్రఖ్యాతులు. వీరు ఆ శ్రీదేవి అనుగ్రహవిభూషితులై, మహా విద్వాంసులై, సంగీత సాహిత్యవేత్తలై అమ్మవారిపై దివ్య కీర్తనల రచించినవారు. శ్రీ శ్యామశాస్త్రి 'శ్యామకృష్ణ' అను నామంకలిగి, దేవ్యారాధకుడై, పండితోత్తముడై, ఆ జగన్మాతపై అనేక కీర్తనల రచించి, 'శ్యామకృష్ణ సోదరి' అని కీర్తనచివర అంకితమిచ్చిన మహాను భావుడు. ఇదేవిధంగా బాలాంబికాదేవి అనుగ్ర హంతో జనించిన శ్రీ ముత్తుస్వామి దీక్షితులు ఆగమ, మంత్ర, జ్యోతిశ్శాస్త్ర నిర్ణేతుడు. గుర్వాను గ్రహంతో వీణావాదనంలో ఆరితేరి, దేవీ ఉపాసన కుడై, నవావరణకీర్తనల వ్రాసి, 'గురుగుహ' అని

అంకితం యిచ్చినవాడు. నవగ్రహకీర్తనలకూడా రచించాడు. నవావరణ కీర్తనలలో మంత్ర, తంత్ర రహస్యాలు గోచరిస్తాయి. శ్రీ శ్యామశాస్త్రి ముత్తుస్వామి కీర్తనలు బహుళ ప్రచారంలో ఉన్నవి. వీరిరువురు సంగీతసామ్రాట్టులు అనక తప్పదు. ఈవిధంగా దేవ్యనుగ్రహపాత్రులైన వారెందరో మహానుభావుల్లు. తాము ఆనందించి, ఆ ఆనందాన్ని లోకాని కందించిన దివ్య మూర్తులు.

ఇదే విధంగా బెంగాల్‌దేశంలో ఆ జగత్పావని కాళికాదేవి నారాధించి, అనేక కీర్తనల రచించి, విశ్వవిఖ్యాతి నార్జించిన పుణ్యమూర్తులు రామప్రసాద్, కమలకాంతులు. వీరి కీర్తనలు సుప్రఖ్యాతములు. వీరిరువురికి అమ్మవారు పిలిస్తే పలికేది. అదృష్టవంతులు. ఇటువంటి మహద్భాగ్యం ఎంతమందికి కలుగుతుంది? శ్రీ రామకృష్ణ దేవుడు భక్త్యున్మత్తుడై, రామప్రసాద్, కమలకాంతుల కీర్తనలను తన మధురమైన కంఠంతో గానం చేసి, శ్రోతలకు తన్మయతను కలిగించేవాడని ప్రతీతి. బెంగాల్‌లో ఎందరో ఆ మహామాయికి ప్రియభక్తులు!

ఇంతవరకు చూచిన పద్ధతిలో ఆలోచించివచో మానవునికి 'భక్తి' అత్యావసరమని గోచరిస్తుంది. తనను గురించిగాని, ప్రపంచంగురించిగాని ఆలోచిస్తే ఏదో ఒక అగోచర దివ్య శక్తి ఉన్నదని సుస్పష్టం అవుతుంది. మనకందని ఆ శక్తిపై పూజ్యభావంతో, వినయవిధేయతలతో నమస్కరించవలసినదే! ఆ శక్తి అనుగ్రహంతో యీ సృష్టిరహస్యాలను గ్రహించవలసిందే! తప్పదు. అదే భక్తి. 'మోక్షకారణ సామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ' అని భక్తి ప్రాముఖ్యాన్ని వెల్లడించింది భక్తిశాస్త్రం. భక్త్యా వినా బ్రహ్మజ్ఞానం కదాపి నోపజాయతే భక్తిలేనిదే బ్రహ్మజ్ఞాన మలభ్యమని కూడా నొక్కి పలికింది. కాన మానవుడు ముందు

భగవంతుని ఆశ్రయించవలసిందే! భక్తిసంయుత మైన మనస్సుకు అధిక శక్తి లభిస్తుంది. ఆ దేవ దేవికై తపిస్తూ, అహర్నిశలు ఆమె నారాధించటం భక్తి. ఆమెను సదా స్మరించటం భక్తి. ఆ జగదంబను శ్రవణం చేయటం భక్తి. నిర్గుణాన్ని సగుణం చేయగల శక్తి భక్తికే ఉన్నది. ఆ లోకమాతకై పొందిన ఆవేదన నిరాకారాన్ని సాకారం చేస్తుంది. ఆ తల్లిని పిలిచిన పిలుపులన్నీ సహస్రనామా లయ్యాయి. భక్తుని హృదయ పరితాపం పరాకాష్ఠనందుకున్న స్థితిలో ఆ నిరాకార, నిర్గుణ నిరాధార అయిన ఆ శక్తి, అదృశ్య శక్తి, సర్వవ్యాపక శక్తి, అనిర్వచనీయ శక్తి, తన భక్తుని యిష్టదైవరూపాన్ని ధరించి, భక్తుని ముందు సాక్షాత్కరించి, ప్రేమతో వీక్షించి, దివ్యా నందాన్ని ప్రసాదిస్తుంది. ఒక్కసారి ఆ తల్లి ప్రత్యక్షం అయితేనే అంతఆనందం కలిగితే, యిక సర్వకాల సర్వావస్థల ఆ జగజ్జనని దర్శిస్తూ ఉన్న వారికెంత ఆనందమో గదా! అట్టి స్థితి యథార్థ భగవద్భక్తులకే సాధ్యం.

ఈ భక్తి ఒక్కొక్క మెట్టు నెక్కుతూ, తనతో భక్తుని కూడా నడిపిస్తుంది. శ్రవణాది నవవిధ భక్తుల ద్వారా సర్వేంద్రియ సద్వినియోగం చేయిస్తుంది. లౌకిక విషయాలవైపు విచ్చలవిడిగా పరుగులు వేస్తున్న యింద్రియా లనే అశ్వాలకు కళ్లెం వేసి అదుపులో పెట్టుతుంది. బాహ్యేంద్రియ నిగ్రహాన్ని కలిగించి, అంతరింద్రియ నిగ్రహానికి దారి చూపు తుంది. అంత మనస్సును అరికట్టుతుంది. వినయ విధేయతల నందించి, అహంకార నిర్మూలనం గావి స్తుంది. మనోనిగ్రహం ఏర్పడితేగాని ఏకాగ్రత రాదు. ఏకాగ్రత కలిగితేగాని జపం సాగదు. జపంలో ఒక ఏకత్వం సిద్ధిస్తేగాని ధ్యానం కుదరదు. ధ్యానం కుదిరితేగాని యిష్టదేవతా ప్రాప్తి కలుగదు. అందువలన

యీ భక్తిలో ఒక క్రమ పద్ధతిని ఏర్పాటు చేశారు మన మహర్షివర్యులు. విద్యలో, మాటలో, రచనలో, భక్తిలో, జ్ఞానంలో జీవితంలో బాల్యంనుండి ఒక క్రమ శిక్షణను పాటించే వారికి జీవితం ఆనందమయం అవుతుందనే సూత్రం యిమిడి ఉన్నదని గ్రహించాలి. శాస్త్రప్రబోధ వినాలి. ఆచరణలో నిష్ణాతులైన మహనీయుల అడుగుజాడలలో నడవాలి. వారి వ్యక్తిత్వాన్ని గ్రహించి, వారి వ్యక్తిత్వంలో తన వ్యక్తిత్వాన్ని లీనం చేయాలి. అప్పుడే ఆ మహానుభావుల వ్యక్తిత్వం కూడా మనకు సహకరించి, యితోధికంగా మన వ్యక్తిత్వాన్ని వికసింపజేస్తుంది. కాని యిది అంత సులభం కాదు.

ఈ భక్తి నడకను బట్టి నవవిధభక్తులుగా విభజించింది భక్తి శాస్త్రం. 'శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనం! అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనం॥' తొమ్మిది విధములని భక్తి స్థితిని బోధించింది భాగవతం. ఎవరికి ఏ దేవుడు యిష్టమో ఆ దేవునికే దీనిని అన్వయం చేసుకోవాలి. శ్రవణ, కీర్తన, అర్చన భక్తులచే బాహ్యేంద్రియ సద్వినియోగం, నిగ్రహం, స్మరణభక్తిచే మనస్సుంయమనం, పాదసేవన, వందన భక్తులచే అహంకార నాశనం, దాస్యభక్తిచేత సేవాభావం, సఖ్యభక్తిచే ఏకాత్మత, ఆత్మనివేదన భక్తిచే సర్వార్పణ బుద్ధి లభిస్తాయి భక్తుడికి. ఇవన్నీ పక్వత పొందితేగాని భక్తిమార్గంలో ప్రయాణం చేయలేడు.

పైన చెప్పిన భక్తివిధానాలన్నింటికి శ్రవణం చాల ముఖ్యం. ఈ శ్రవణం సరిగా ఉంటే తర్వాత భక్తివిధానాలన్నీ సులభంగా సిద్ధిస్తాయి. అందు చేతనే 'శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః' అని శ్రవణానికి ప్రథమ స్థానం కల్పించింది శాస్త్రం. శ్రవణం అంటే వినటం అని అర్థం. శ్రద్ధతో,

విశ్వాసంతో శ్రవణం చేయాలి. ఈ శ్రద్ధావిశ్వాసాలే భక్తికి పునాదులుగా ఉంటాయి. 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం' అని గీతలో శ్రీకృష్ణవాణి. విద్యలో శ్రద్ధ ఉంటే ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడవుతాడు. సంగీతంలో శ్రద్ధ ఉంటే సంగీత విద్వాంసుడు కాగలడు. సాహిత్యంలో శ్రద్ధ ఉంటే గొప్ప సాహితీవేత్తగా రాణిస్తాడు. దైవ విషయంలో శ్రద్ధఉంటే మహాజ్ఞానిగా శోభిస్తాడు. తపస్సులో శ్రద్ధ ఉంటే తపోనిధి అవుతాడు. అందు చేతనే 'శ్రద్ధయా శ్రవణం కుర్యాత్' శ్రద్ధతో శ్రవణం చేయాలని శాస్త్రాదేశం. కాని యీనాడు అనేక వేదాంత గ్రంథాలుండటం చేత పఠనమేగాని శ్రవణం తక్కువేమో అనిపిస్తున్నది. ఎంత శ్రద్ధతో శ్రవణం చేస్తే మనస్సు అంతగా ఆ దేవతామూర్తిపైన హత్తు కుంటుంది. అంతేకాదు అనుభవజ్ఞుడైన వ్యక్తియొక్క భావపరంపర శ్రోతహృదయంలో చేరి, శ్రోతకు ఏకాగ్రత కలిగిస్తుంది. ఆవిధంగా శ్రద్ధగా శ్రవణం చేసి తమ జీవితాన్ని పునీతం గావించుకున్నవారు పరిక్షిన్మహారాజు, కులశేఖరాళ్వారు, తులసీదాసు మొదలైనవారు. సర్వాదర్శమూర్తులు వీరు.

రెండవది కీర్తన భక్తి. శ్రవణభక్తిని శ్రద్ధగా ఆచరించినవారికి, సాహిత్యం, కవిత్వం తోడైతే ఆ భగవతి గొప్పదనాన్ని తన ఆవేదనను, ప్రాపంచిక నశ్వరత్వాన్ని గూర్చి భక్తితో, వైరాగ్యంతో అనేక కీర్తనల రచించుకుని ఆనందిస్తాడు. వచన పఠనంలో ఒక విధమైన ఆనందం కలిగితే, కీర్తనగానంలో ఒక విధమైన ఆనందం లభిస్తుంది. సాహిత్యసంగీతాలు ఒక జంట. సాహిత్యం మనస్సును ఆలోచింపచే స్తుంది. సంగీతం హృదయాన్ని స్పందింపజేస్తుంది. మనస్సు విమర్శకు దిగుతుంది. హృదయం ఆచరణకు పూనుకుంటుంది. సాహిత్యం తాత్కాలిక ఆనందాన్ని కలిగిస్తుంది. సంగీతం శాశ్వతానందాన్ని అంది

స్తుంది. సాహిత్యం మనోవికాసాన్ని కలిగిస్తుంది. సంగీతం హృదయవికాసాన్ని చేకూరుస్తుంది. మనస్సు హృదయం వినా రాణించదు. సంగీతం భక్తివినా శోభించదు. సాహిత్యం, ఏ భావానికి ఏ పదజాలం ఉపయోగించాలో, ఏ భావానికి ఏ రాగం బాగుంటుందో అని ఆలోచింపజేస్తుంది. రాగాన్ని హృదయానికి అనుసంధింపజేసి, అనురాగంగా మార్చి, ఆ అనురాగాన్ని భగవంతునికి అర్పించి, భక్తినిరతిలో హృదయవీణను మీటి, భక్తితో గానం చేయిస్తుంది సంగీతం. అందుచేత యీకీర్తన భక్తిలో హృదయం ముందుకు వస్తుంది. ఈ భక్తిద్వారా భక్తిబీజం మొలకెత్తుతుందనవచ్చు. కీర్తనలోని భావాలన్ని దృష్టిలో ఉంచుకుని, గానం చేయటం యీ భక్తియందలి ప్రత్యేకత. ఇటువంటి గానానికి భగవంతుడు వశుడౌతాడు. హృదయంలో బంధింపబడతాడు. 'మద్భక్తాః యత్రగాయంతి తత్రతిష్ఠామి' అన్నాడు భగవానుడు. ఇందులో 'నా భక్తులు గానం చేస్తే అక్కడే ఉంటాను' అని ఉన్నది. భక్తులు కానివారు, భక్తిలేని వారు గానం చేస్తే ఆ భగవానుడు అక్కడ ఉండడని అర్థమేగా! కాబట్టి భక్తితో పాడుకోవాలని అర్థం. రామదాసు, త్యాగరాజు, సూరదాసు, పురందరదాసు, తుకారాం, మీరా, తులసీదాసు మున్నగువారు తమ గానంతో ఆ భగవానుని ఆనందింపజేసి, తర్వాత లోకాన్ని కూడా ఆనందసాగరంలో ఓలలాడించారు. గానంలో అంత మాధుర్యం ఉన్నది. ఈ కీర్తనా భక్తివిధానంలో హృదయనివాసియైన భగవానుడు భక్తుని గానామృతాన్ని గ్రోలటానికి బయటకు తొంగి చూస్తాడేమో! శ్రీ వివేకానంద స్వామి (చిన్ననాటి పేరు నరేంద్రనాథదత్త) గళమెత్తిగానం చేస్తూ ఉంటే, ఆ గాన మాధుర్యానికి ఉప్పొంగిన శ్రీ రామకృష్ణుని హృదయం సమాధి సంస్థితులలో నిలిచిపోయేది. అది కీర్తన భక్తి విశిష్టత.

మూడవది స్మరణ భక్తి. స్మరణ అంటే స్మరించటం అని అర్థం. ఎడతెగని భావన స్మరణ. సదా భగవానుని స్మరించటం. దేన్ని స్మరిస్తే దాన్నే పొందుతాడు. అందుచేత మానవుడు మంచినే స్మరించి మంచివాడిగా, చెడును స్మరించి చెడ్డవాడిగా తయారవుతాడు. 'ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే। సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోభిజాయతే॥' క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః। స్మృతి భ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి॥' అని భగవద్గీతలో చెడుభావనతో చెడిపోయిన విషయం 2 శ్లోకాలలో చక్కగా చెప్పబడ్డది. లౌకికవిషయ స్మరణచే వాటియందు ఆసక్తి, దానిచేకోరిక, ఆకోరిక నెరవేరకున్న క్రోధం, దానిచేతమోహం, ఆ మోహంచేత మరుపు, దాని చఏత స్మృతిభ్రంశము, దానిచే బుద్ధి నాశనం, ఆ బుద్ధినాశనం చేత సర్వనాశనం అని అర్థం. ఈ విధమైన సర్వనాశనానికి కారణం యీ విషయ స్మరణమే। కాన మానవుడు అనిత్య విషయస్మరణ మాని, నిత్యనిరంజనుడైన భగవానుని స్మరించుట శ్రేయస్కరం. ఎప్పుడు, ఎక్కడ స్మరించాలి అనేది లఏదు. 'శుచిర్వా వ్యశుచిర్వాపి' అనికూడా ఉపదేశించింది శాస్త్రం. ఈ భక్తిలో ఆరితేరిన వాడు బాలభక్తుడైన ప్రహ్లాదుడు. విరోధియైన విష్ణుభక్తిని మానమని తండ్రి హిరణ్యకశిపుడు సముద్రంలో తోయించినప్పుడు, అగ్ని గుండంలో పడవేయించినప్పుడు, పర్వతశిఖరాలనుండి నెట్టించినప్పుడు, పాములచేత కరిపించినప్పుడు, ఏనుగులచేత త్రొక్కించినప్పుడు కూడా తన యిష్టదైవాన్ని క్షణమాత్రం విస్మరింపని పరమ భక్తశిఖామణి ప్రహ్లాదుడు. 'పానీయంబులు ద్రావుచున్, గుడుచుచున్, భాషింపుచున్...' అంటూ ఆ ప్రహ్లాదుని స్థితిని చక్కని పద్యాలలో వర్ణించాడు పోతనామాత్యుడు.

భాగవతంలో. ఇంత స్మరణనిష్ఠకు కారణం ప్రహ్లాదు డట మాతృగర్భంలో ఉన్నప్పుడు నారద మహర్షివ ర్యుడు బోధించిన భక్తి విషయాలను శ్రద్ధగా శ్రవణం చేయటమే. కాన శ్రవణం స్మరణలో లీనం అయి, అవిచ్ఛిన్న ప్రవాహంగా మారుతుందని అర్థం. అందు వలననే సర్వ భక్తివిధానాలకు శ్రవణం అత్యా సరమైనది.

నాల్గవది పాదసేవన భక్తి. సేవ అందరికీ దొరుకుతుందిగాని పాదసేవ అందరికీ లభించదు. సామాన్యమైన సేవ అందరూ చేస్తారు. పిల్లలు పెద్దలకు కొన్ని సేవలు చేస్తారు. విద్యార్థులు ఉపాధ్యాయులకు కొన్ని సేవలు చేస్తారు. కాని పాదసేవ చేయటానికి వెనుకంజవేస్తారు. పాదాభి వందనమే చేయనివారు యిక పాదసేవ చేస్తారా? ఇది చేస్తే తమ హెూదాకు భంగమని భావిస్తారు కూడా. మనిషి నిలవాలంటే, నడవాలంటే యీ పాదాలే అవసరం. మనిషి సంచారానికి నిత్య జీవితంలో యీ పాదద్వయం అత్యవసరం. సర్వేంద్రియముల కంటె తాము క్రిందనున్నామని భావింపక, కించపడక మొత్తం శరీర భారాన్ని మోస్తున్నవి గదా యీ పాదాలు. పెద్దలకు పాదసేవ చేస్తే చాలా మంచిది. శ్రీరాముని పాదసన్నిధిని నమ్రతతో కూర్చున్న ఆంజనేయస్వామి లోకారాధ్యు డయ్యాడు. 'శిష్యస్తేహం' అంటూ వ్యాకుల చిత్తంతో, శ్రీ కృష్ణుని పాద పద్మముల వినయముతో నాశ్ర యించిన అర్జునునిద్వారా భగవద్గీత బహిర్గతం అయింది. ధర్మమూర్తి అయిన శ్రీ రఘురాముని పాద సేవనార్థం తల్లిని, భార్యను వదలివచ్చిన అన్నతో పాటు అరణ్యవాసం చేసిన లక్ష్మణుడు త్యాగపురుష డయ్యాడు. ప్రత్యక్షంగా ఆ మహద్భా గ్యానికి నోచుకోని భరతుడు, ఆ దాశరథి పాదుకలను

సాక్షాత్ శ్రీ రాముని పాదపద్మములుగా భావించి, శిరస్సుపై నిడుకుని, తర్వాత పదునాలుగు సంవత్సరములు సింహాసనంపై ఉంచి, సేవించి భక్తాగ్రేసరుడయ్యాడు. ఆ శ్రీరామచంద్రుని పాదప్రక్షాళన గావించి ధన్యుడయ్యాడు గుహుడు. ధనదేవతగా సర్వులచే పూజింపబడుచున్న క్షీరసముద్ర రాజ తనయ శ్రీమహాలక్ష్మి, శ్రీ మహావిష్ణు చరణకమలముల నాశ్రయించి, పాదసేవగావిస్తూ, ఎల్లరకు వినయవిధేయతల బోధిస్తున్నది. కాని ఆ లక్ష్మిని పొందిన మానవులలో మాత్రం ఆ తల్లికి ఉన్న వినయవిధేయతలు రాకపోగా ధనగర్వం మాత్రం విజృంభిస్తూ ఉంటుంది. 'సర్వేగుణాః కాంచనమాశ్రయంతి' అన్ని గుణములకు ఆశ్రయం ధనమే అను భర్తృహరి వచనం ఎంత సత్యం! అహంకారం తగ్గి, వినయ సంపద కలగటానికే ప్రాచీన గురుకులాశ్రమస్థులైన బ్రహ్మచారులకు, స్థావ, అంగ, భావ, ఆత్మ శుశ్రూషా చతుష్టయాన్ని విధించారు మన పెద్దలు. అంగ శుశ్రూష అంటే పాద సేవ అని అర్థం. ఈ సేవలు జన్మనిచ్చిన తల్లిదండ్రులతో ప్రారంభమై, విజ్ఞాన భిక్షనందించిన గురువుల-చేరి, భగవంతుని చేరుకోవాలి. గర్వనాశనం దీని ఫలితం.

అర్చన అయిదవది. అర్చన అంటే పూజ అని అర్థం వస్తుంది. ఈ అర్చన వలన స్థిరత్వం, ఇంద్రియ సద్వినియోగం, నిగ్రహం లభిస్తాయి. పూజకై ఆసనబద్ధంగా కూర్చోవాలి గదా! దీనివలన పాదద్వయం స్వాధీనమై, ఆసనానికి స్థిరత్వం కలుగుతుంది. ఇందులో స్థిరత్వం కలిగితే అన్నిటికీ స్థిరత్వం లభించటానికి అవకాశం ఉన్నది. వాక్కు భగవన్నామాలను చదువుతుంది. అనవసర ప్రసంగం లేకుండుట చేత సద్వినియోగం, వాక్కుకు నిగ్రహంకూడా సిద్ధిస్తాయి. నేత్రాలు యిటు నామాల

న్ను, అటు భగవంతుని కూడా చూస్తూ ఉంటాయి. అనవసర దృశ్యాలను చూడకుండటంవలన పవిత్ర దృష్టి ఏర్పడుతున్నది. కండ్లతో చూస్తున్న నామాలను వాక్కు బిగ్గరగా పలుకుతూ ఉంటే శ్రోత్రాలు చక్కగా శ్రద్ధతో శ్రవణం చేస్తుంటాయి. అనవసర శబ్దాలను వినకుండటంవలన శ్రోత్రములకు నిగ్రహం ఏర్పడుతున్నది. ఒక చెయ్యి పుస్తకాన్ని పట్టుకొనగా, రెండవచెయ్యి భగవంతునికి పూలను సమర్పిస్తూ అర్చన చేస్తున్నది. అనవసరపు పనులు చేయకుండటం వలన పాణిద్వయానికి నిగ్రహం కలుగుతున్నది. ఈ విధంగా సర్వేంద్రియాల ద్వారా మంచి కార్యాలను సాగిస్తున్న మనస్సుకు కూడా మంచి విషయాలలో అధికమైన ఆసక్తి కలిగి, ఉత్తమ భావాలు, ఉన్నత ఆశయాలు కలిగే అవకాశం లభిస్తున్నది. పైవిధంగా సర్వేంద్రియ సద్వినియోగం చేస్తూ, సూక్ష్మబుద్ధిని తయారు చేస్తుంది యీ అర్చనా విధానం. ఇది దీని ప్రత్యేకత.

ఆరవది <u>వందనం</u>. వందనం అంటే నమస్కారం అని అర్థం. రెండు చేతులను జోడించి నమస్కరించాలి. దేవుడికి మహాత్ములకు సాష్టాంగ నమస్కారం చేయాలి. నమస్కారంలో వినయవిధేయతలు, భక్తి శ్రద్ధలు వ్యక్తం కావాలి. దేవాలయానికి వెళ్లి, దేవునికి నమస్కరించే సమయంలో నేత్రద్వయం మూతపడుతుంది. అంటే బాహ్యదృష్టి కాక అంతర్దృష్టిని పెంపొందించు కోవాలని అర్థం. గురువు వద్దకు వెళ్లి నమస్కరించాలి. 'నమస్త్యైక్యం ప్రవదేత్' అను రీతిగా ఏకత్వాన్ని సూచిస్తుంది. దేనినుండి? సకల ద్వంద్వములతో కూడిన యీ ప్రపంచంనుండి. దేనితో ఏకత్వం? అనేకంలో ఏకరూపుడుగా ఉన్న భగవంతునితో. నానాత్వముగా గోచరించు యీ జీవత్వం నుండి 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' అని

చెప్పబడిన అద్వితీయ బ్రహ్మంతో ఏకం కావాలనేదే ఈ మానవ జీవిత గమ్యం. ఈ అర్థాలను గ్రహించి నా, గ్రహించకున్నా భగవంతునికి హృదయపూర్వ కంగా వందనమాచరించటం తప్పక చేయాలి. శిరస్సువంచి నమస్కరించాలి. కురుక్షేత్రయుద్ధ ప్రారంభంలో వృద్ధులు, పూజ్యులు, గురువులైన భీష్మద్రోణుల పాదాలవద్దకు బాణాలను వదిలాడు అర్జునుడు. వాటిని నమస్కార బాణాలన్నారు. వారిరువురు, ఉప్పొంగి, మనస్సులోనే ఆశీర్వదించారు అర్జునుని. అంతలోనే రణరంగానికి వచ్చిన పాండవ జ్యేష్ఠుడైన ధర్మరాజు, రథందిగి, భీష్మద్రో ణులను సమీపించి, నమస్కరించి, 'విజయీభవ' అని వారి హృదయపూర్వక దివ్యాశీస్సుల నందుకుని విజయుడయ్యాడు. నమస్కారంలో చక్కని సంస్కారం ఉన్నది. పెద్దల ఆశీస్సులు లభిస్తాయి. జీవితం సుఖమయం చేసుకొనే అవకాశమున్నది యిందులో.

దాస్య భక్తి ఏడవది. దాసుడు అంటే సేవకుడని అర్థం. భగవంతుని యజమానిగా భావించినవాడికి యీ 'దాస' శబ్దం వర్తిస్తుంది. ఈ దాసుని స్థానం క్రింద అనే భావిస్తాడు యీ భక్తుడు. యజమాని కార్యాలన్నింటిని శ్రద్ధాభక్తులతో చేసేవాడు సేవకుడు. 'దంసయతే స్వామికార్యాణి సావధానేనేతి దాసః' స్వామి కార్యముల సావధానంగా చేసేవాడని దాస శబ్దార్థం. ఎల్లప్పుడూ స్వామిని దర్శిస్తూ, స్పర్శిస్తూ, సేవిస్తూ ఉంటాడు యీ భక్తివిధానంలో. యజమానికి అత్యంతసన్నిహితుడుగా ఉంటాడు. 'తవదాసోహం తవదాసోహం తవదాసోహం దాశరథే రామ' అని వ్రాసుకున్నాడు త్యాగరాజస్వామి. ఈ భక్తికి సర్వాద ర్శమూర్తి, నిరంతర రామ నామతత్పరుడు, పరమ భక్తాగ్రేసరుడైన హనుమంతుడు. అట్టి సేవాభాగ్యా న్ని తనకుకూడా అనుగ్రహించమని 'బంటురీతి

కొలువీయవయ్యరామా' అని సేవాభావంతో యీ కీర్తనను రచించాడు త్యాగరాజస్వామి. ఆ భక్తిలో భగవానుని సేవించి సేవించి, రామదాసు, కృష్ణదాసు, భగవద్దాసు లయ్యారు కాని వారు ధనదాసులు, వ్యసనదాసులు, మాత్రం కాలేదు. అది వారి ఉత్త మాదర్శం. భగ వానుని యజమానిగా విశ్వసించి, దైవ సంబంధ కార్యాలనే నిస్స్వార్థంగా ఆచరిస్తూ, లౌకికవిషయ దాసుడు కాకుండా ప్రవర్తించటమే యీ భక్తిలోని విశిష్టత.

ఎనిమిదవది సఖ్యభక్తి. సఖ్యం అంటే స్నేహం. సమానస్థులైన వారిమధ్యనే స్నేహం నిలుస్తుంది లౌకిక జీవితంలో. బలవంతుడికి బలహీనుడికి, ధనవంతుడికి పేదవాడికి, విద్యావంతుడికి విద్యా హీనుడికి యీ ప్రాపంచిక జీవితంలో సఖ్యం కుదరదు. ధనవంతుడు దరిద్రుడిని యీసడించి వెళ్ళగొట్టు తాడు. తెలివి తక్కువవాడిని లెక్కచేయడు తెలివిగల వాడు. ఇక స్నేహం ఎక్కడ కుదురుతుంది? ద్రుపద ద్రోణు లిరువురు ఒక గురువువద్దనే విద్యాభ్యాసం చేశారు. అమిత స్నేహంగా ఉండేవారు. తర్వాత విడిపోయారు. ద్రుపదుడు మహారాజయ్యాడు. ఒకసారి ద్రోణాచార్యులు ద్రుపదుని చూడటానికి వెళ్లాడు. అక్కడ స్నేహం లేదు. మహారాజ గర్వంతో ద్రోణుని కించపరిచాడు ద్రుపదుడు. ఇరువురి మధ్య కక్షలు ఏర్పడ్డాయి. ఆ కక్షను శిష్యుడైన అర్జునునిద్వారా తీర్చుకున్నాడు ద్రోణుడు. దీని ఫలితంగా యిరువురు కురుక్షేత్రరణరంగంలో మరణించారు. ఇది లౌకిక స్నేహలక్షణం, ఫలితం. కాని యీ భక్తియందలి సఖ్యతమాత్రం సమానత్వ మస్థిరత్వాల నందుకుంటుంది. ఇది భగవంతునితో స్నేహంకదా! ఆ దేవదేవుడైన ప్రేమమూర్తికి యీ భేదమే ఉండదు. సాందీపని ఆశ్రమంలో విద్యా

భ్యాసం చేశారు కృష్ణుడు, కుచేలుడు. ఒకరిని వదలి ఒకరుండేవారు కారు వారిరువురు. విద్య పూర్తి అయింది. ఎవరి ఊరికి వారు చేరుకున్నారు. కుచేలుడు మాత్రం తన చిన్ననాటి చెలికాడిని మరచిపోలేదు. నిత్యం స్మరిస్తున్నాడు ఆ శ్రీ కృష్ణుని తన యిష్టదైవంగా. శ్రీ కృష్ణ పరమాత్మ అంతులేని భోగభాగ్యాలతో తులతూగుతున్నాడు. ఒకసారి కుచేలుడు తన మిత్రుని చూడటానికి వచ్చాడు. ఎంత పేదరికమో ఆ కుచేలునికి. అయినా శ్రీ కృష్ణ భగవానుడు స్వయంగా వచ్చి, స్నేహితుని ఆప్యాయంగా కౌగిలించి, లోపలికి తీసుకుని వెళ్లి, ఆ సద్బ్రాహ్మణుని పాదాలను కడిగి, అన్ని ఏర్పాట్లను చేశాడు. యోగక్షేమాలను అడిగాడు. అడగక పోయినా అష్టైశ్వర్యాలను అనుగ్రహించాడు. ఇది అలౌకిక స్నేహంలో ఉన్న మాధుర్యం. భగవంతుని స్నేహితునిగా భావించి, ఆడుకొని, పాడుకొని, ఆయనతో కూర్చుని చల్దులారగించిన గోపబాలుర భాగ్యమే భాగ్యము కదా! వారెంత పుణ్యమూర్తులో! స్నేహమధురిమలో హెచ్చుతగ్గులు లేవు. ఈ స్నేహాన్ని మాత్రమే కోరుకుంటాడు యీ సఖ్యభక్తిలోని భక్తుడు. కొన్ని సల్లక్షణాలను సంపాదించి సఖ్యభక్తిని సాధిస్తాడు. దాస్యభక్తిలో క్రింద కూర్చున్న భక్తుడు యీ సఖ్యభక్తిలో ప్రక్కన చేరి ఆనందిస్తాడు. ఇక్కడ సమానత్వమే.

తొమ్మిదవది ఆత్మనివేదన. సంపూర్ణ ఆత్మార్పణం అని అర్థం. పైన దాస్య సఖ్య భక్తి విధానాలలో ఆ భక్తులకు ప్రత్యేక వ్యక్తిత్వం కనిపిస్తుంది కాని యీ ఆత్మ నివేదనలో అది అగోచరం. నీవు తప్ప ఎవరూ లేరనే భావం, త్యాగం ముందుకు రావాలి. అప్పుడే భగవద్రక్షణ. అంతవరకు ఆయన రాడు కూడా. ద్రౌపది రెండు చేతులెత్తి సర్వార్పణం అంటేగాని శ్రీకృష్ణ భగవానుడు 'అక్షయం' అనలేదు.

ఎంతకాలం ప్రార్థించినా ఫలితం లేక, దిక్కు తోచక, మకరికి చిక్కిన గజరాజు కాళ్లు, తొండం పైకెత్తి 'లావొక్కింతయు లేదు...' అని ఆత్మార్పణం చేసుకుంటేనే, ఆవైకుంఠంనుండి, ఆ మూల సౌధంలో నుండి, ఎవరికీ చెప్పకుండ భక్తరక్షణార్థం పరుగున వచ్చాడు శ్రీ మహావిష్ణువు. అంటే తన ఉనికిని, తన వ్యక్తిత్వాన్ని మరచి, సర్వం భగవానునికి సమర్పించటం యీ భక్తివిధానం.

ఈ నవవిధ భక్తి విధానంలో ప్రపంచంలో నున్న రెండు సంబంధాలు వచ్చాయి. అవే దాస్యం, సఖ్యం. ఈ రెండింటికి మరి మూడు సంబంధాలను చేర్చి పంచ భావములు అన్నారు. వాటిని శాంత, దాస్య సఖ్య వాత్సల్య మధురము లంటారు. శాంత భక్తితో భగవంతుని సృష్టి, స్థితి, లయ కారకునిగా భావించి దూరంగా ఉంటాడు భక్తుడు. మహారాజుకు ప్రజలకు మధ్య ఉన్న సంబంధం వంటిది యిది. ఇక దాస్య సఖ్య భక్తి విషయాలు పైన వివరింపబడినవి.

వాత్సల్య భక్తిలో భగవానుని తమ బిడ్డగా భావించటం జరుగుతుంది. అట్టివారు శ్రీరాముని కన్న కౌసల్యాదశరథులు, శ్రీకృష్ణుని కన్న దేవకీ వసుదేవులు. కాని యిక్కడ ఆ భగవానుని బిడ్డగా భావించి, ఉపాసన చేసి, బాలరూపంలో ఆ భగవంతుని సాక్షాత్కరింపజేసుకున్నవారని అర్థం. అట్టివారు జటదారి, శ్రీరామకృష్ణ దేవుడు, అఘోరమణీ దేవి సూరదాసు మొదలైనవారు. జటదారి అనే ఒకవైష్ణవ సన్యాసి ఒకసారి దక్షిణేశ్వరానికి వచ్చాడు. ఆయన వద్ద ఒక చిన్న రామలాల్ విగ్రహం ఉండేది. ఆయన ఉపాసన సిద్ధించి, బాలరాముడు ఆయన వెనుక గంతులు వేస్తూ తిరిగేవాడు. ప్రతిదినం స్నానం చేయించటం, ఎత్తుకొని లాలించటం,

అన్నం తినిపించటం చేసేవాడు. ఇది వాత్సల్యా భావోపాసనా ఫలితం. ఆ వాత్సల్యభావంలోనే 'రామా యన్న నిమేషమే చిరుతయై రాంలాల నామంబునన్ నీ ముం దాటలనాడు; కృష్ణుడగుచున్ నీ(మ్రోల సాక్షాత్కరిం చేమేమో సరసోక్తులాడుగద హే కృష్ణాయనన్...' అని శ్రీ రామకృష్ణాంజలి శతకంలో శ్రీ అనుభవానందస్వాములవారు రచించి నట్లు, శ్రీ రామకృష్ణుడు సాధన సలిపి, బాలరాముని, నందకిశోరుని సాక్షాత్కరింప జేసుకొని, వారిని తన ఒడిలో కూర్చుండబెట్టుకుని, లాలించి, ఆడుకున్నాడు. ఈ వాత్సల్య భావంలో భగవంతుడు పసి వాడై, భక్తుని ఒడిలో ఒదిగి, తన చిలిపి పనులతో ఆ భక్తుని అలరింపజేసి, ఆనందాన్ని యిస్తాడు. అఘో రమణీదేవి బాలకృష్ణ ఉపాసకురాలు. ఆ బుల్లి కృష్ణుడు ఎప్పుడూ ఆమెపై ఎక్కి ఆమెను విసిగించే వాడు. అంత వాత్సల్యం చూపింది ఆతల్లి ఆ బాలకృష్ణునిమీద. ఎంత ధన్యాత్ములు వారు!

ఇక మధుర భక్తిలో అలౌకికమై, అరమరికలు లేని సంబంధం ఉన్నది. భగవంతుని భర్తగా ఆరా ధించటం. భగవానుడు భరించువాడని, భరింప బడేవాడు భక్తుడని అర్థం. భగవంతుడొక్కడే పురు షోత్తముడనియు, జీవులందరూ స్త్రీలనియు, యీ జీవులెల్లరూ భరింపబడువారనియు అసలు అంత రార్థం. ఈ సంబంధాన్ని భార్యాభర్తల సంబంధంలో అన్వయం చేశారు. 'యథా నద్యః స్యందమానా స్సముద్రే స్తం గచ్ఛంతి నామరూపే విహాయ' నదు లెట్లు తమ నామరూపముల విడిచి సముద్రమున లీనం అవుతున్నదో అదే విధంగా జీవులంతా తమ నామరూపముల త్యజించి, బ్రహ్మానంద సాగరంలో చేరుతారని చక్కగా వర్ణించింది శాస్త్రం. అందుచేత యీ భక్తభగవానుల సంబంధం అనిర్వచనీయం

అని చెప్పాలి. భగవంతుని భర్తగా భావించి ఆరాధించిన వారిలో అత్యున్నత స్థానాన్ని అందుకున్నది మీరాసాధ్వి. వివాహం యొక్క అర్థం తెలియని చిన్న వయస్సులో ఒక పెళ్లి ఊరేగింపును చూచింది బాలమీరా. అదేమిటని ప్రశ్నించి, తనకుకూడ భర్త కావాలన్నది. ఒక చిన్న కృష్ణ విగ్రహాన్ని ఆ పసి పాపకు భర్తగా చెప్పి అందించారు. నాటినుండి తన భర్త ఆ గోపాలుడే అని త్రికరణ శుద్ధిగా విశ్వసించి ఆరాధించింది మీరా. వివాహం చేశారు. అయినా విషయ విముఖయై కృష్ణభక్తిని ఆస్వాదిస్తూ, లౌకికవిషయముల నంటక, సంపదల నాశింపక, రాచమర్యాదల పాటింపక, అనేక బాధల కోర్చి, విషమును కూడా ఆ గిరిధారికి నివేదించి త్రాగి, తన భక్తిచే సర్వాటంకములదాటి, ఆ మురళీ మోహనుని, ఆనందకిశోరుని గూర్చి 'మీరాకే ప్రభు' అని మీరా ప్రభునిగా గిరిధరలాలుని కీర్తించి, అనేకకీర్తనల రచించి, తన జీవితానికి ధన్యతను కలిగించుకొన్నది భక్తమీరాబాయి. ఆమె భక్తికి మెచ్చి, ఆమె పాటలకు ముగ్ధుడైన నందనందనుడు ఆమెకు చివరకి ముక్తిని అనుగ్రహించాడు. అదే విధంగా సూరదాసుకూడా 'సూరదాసప్రభు' అని తన జీవితాన్ని ఆ బాలగోపాలునికి అర్పణ చేసు కున్నాడు. నేటికీ ఆమీరా, సూరదాస విరచిత కీర్తనల హృదయంతో గానం చేసి, భగవత్సాక్షాత్కారాన్ని పొందినవారున్నారు. కాని నేడు ఆ సూరదాస, రామదాస, మీరా కీర్తనల గురించి 'మీరా ఎప్పుడు జన్మించింది? ఎక్కడ? ఆమె యీ కీర్తనలను భక్తితో రచించినదా?' అని ప్రశ్నించుకుని, పరిశోధన చేసిన వారికి భగవత్సాక్షాత్కారం లేకపోగా కీర్తిప్రతిష్ఠలను పొందుతున్నారు. కారణం భక్తి రాహిత్యం. ఈ మధుర భక్తిలోని మధురతత్త్వరసా స్వాదన చేయు వారు ధన్యులు.

పైన వివ రింపబడిన సంబంధాలలో పవిత్రాతిప విత్రమైన సంబంధం, విడదీయరాని సంబంధం, మానవుని బాల్యంనుండి ప్రారంభింపబడిన సంబంధం ఒకటి లేదు. ఏమిటది? అదియే తల్లీ బిడ్డల సంబంధం. భగవంతుని తల్లిగా భావన చేసి కర్తృత్వాలను దూరంగా త్రోసి, ప్రేమించటం తప్ప అన్య మెరుగని దివ్యసంబంధం తల్లీ బిడ్డల సంబంధం. పసిబిడ్డకు తల్లి తప్ప యితర మనవ సరం. ఆ బిడ్డకు బంగారం యిచ్చినా, రత్నాల రాసులు యిచ్చినా అవి వాడి తల్లితో సమానం కావు. అదేవిధంగా యీ మాతృపాసకునికి యీ లౌకికసుఖాలు, యీ ధనధాన్యాలు, యీ కీర్తిప్రతిష్ఠలు, తన ఉపాసనాదైవం ముందు పనికి రానివే. వాటికై ఆశించదుకూడా. బాహ్యాభ్యంతరములలో అమృత స్వరూపిణియైన ఆ దివ్యమాతను దర్శిస్తున్నవానికి యీ క్షణికసుఖాలు దేనికి? ఇక పరలోక సుఖాలపై కాంక్ష ఎందుకు! ఆ తల్లిదర్శనమే అనంతమైన సంపద! ఆ తల్లితో సంభాషణమే ఆనందదాయకం! ఆ తల్లి కృపాకటాక్ష వీక్షణమే మోక్షదాయకం! ఆ తల్లి సన్నిధిలో దుఃఖాలకు తావు లేదు గదా! ఇదియే సహజసంబంధం. దీనికి మించిన సంబంధం లోకంలో వేరొకటి లేదు. భగవంతుడు తల్లి, భక్తుడు బిడ్డ. ఈ దివ్య సంబంధాన్ని తెలియజేయటానికో అన్నట్టు ఆ అవ్యక్త శక్తి ఆ అగోచరశక్తి ఆ అనంత శక్తి వ్యక్తమై, నామ రూపముల ధరించి వస్తుంది. అప్పుడు జీవుల కర్మానుసారం తమోరూపంలో సృజిస్తుంది. రజో రూపంలో పోషణ భారం వహిస్తుంది. సత్వరూపంలో లయింపజేస్తుంది. ఈ కర్తృత్వరహిత సృష్టి స్థితి లయాలు చేయటంలో ఆమెకు ఆమెయే సాటి. ఇంత చిత్రవిచిత్రమైన సృష్టిని, విశాలమైన సృష్టిని గావించిన ఆమెకు అలసట కలుగుతుందా!

ఆమె తన పనుల నన్నింటిని అవతలనుంచి, శ్రీమాతగా అవతరిస్తుంది. అనగా మాతృరూపాన్ని ధరిస్తుంది. ఆమె రూపంలో వాత్సల్యం పొర్లుతుంది. ఆమె రూపంలో కరుణారసం ప్రవహిస్తుంది. ఆమె హృదయంలో దయ పెల్లుబుకుతుంది. అప్పుడు తన బిడ్డలపై అనురాగవర్షాన్ని చిలుకుతుంది. సకల బాధ్యతలను ఆమే స్వీకరించి, తన బిడ్డలను కంటికి రెప్పలాగ కాపాడుకుంటుంది. ఎండలో నడచివచ్చిన బాటసారి చల్లని నీటికై, చల్లని నీడకై తపించినట్లు, 'జన్మదుఃఖం జరాదుఃఖం' అనురీతిగా అనేక జన్మలలో అనేక దుఃఖముల ననుభవించి, విసిగి వేసారిన జీవుడుకూడా నిర్మల ప్రేమకై తిరిగి తిరిగి, మాతృమూర్తికై ఆవేదన ననుభవించి, యధార్థ వైరాగ్యముతో విషయసుఖాలరోసి, భక్తితో పూజించి, కీర్తించి, జపించి, ధ్యానించి, చివరికి ఆ అనురాగ మూర్తిని, ఆశ్రితకల్పవల్లిని, ప్రేమ మయిని వాత్స ల్యావాహినిని, దయాసాగరిని, కరుణాకనుగొని ఆనందాన్ని పొందుతాడు. ఆ లోకమాతకు ప్రణామా లర్పిస్తాడు. తన హృదయాన్ని ఆమెకు అందిస్తాడు. ఇక ఆ హృదయం బాహ్యప్రపంచాన్ని యిష్టపడదు. బాహ్యలోకంలోకి రాదు. ఇది శ్రీమాత అనుగ్రహఫలితం.

ఈ శాక్తేయ విధానంలో పరాకాష్ఠనందుకున్నవాడు శ్రీ రామకృష్ణ పరమహంస దేవుడు. శాక్తేయానికి అపార్థలు కల్పించి, సర్వానర్థదాయకంగా ప్రచారం చేసినవారందరికి కనువిప్పు కలిగించి, తల్లీబిడ్డల సంబంధం లోనున్న పవిత్రతను చక్కగా పోషించి, శాక్తేయసిద్ధాంతానికి పుష్టిని కలిగించిన మహ నీయుడాయన. కాళికాదేవి నారాధించి, ఆమెనుండి సర్వానుభవ సంపదను పుణికి పుచ్చుకున్నాడు. సకల దేవతలను సందర్శించాడు ఆమె అను గ్రహంతో. సర్వమత సమన్వయం మాటలలో గాక

ఆచరించి చూపించాడు ఆదివ్యమాత ఆశీస్సులతో. 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' సద్వస్తువు ఒక్కటే. కాని పండితులు అనేకంగా వచించుచున్నా ను సూక్తిని సాధించి, అనుభవించిన అనుభవమూ ఇ ఆయన. అంతేకాక ఆయన భక్తులలో భక్తుడై, జ్ఞానులలో జ్ఞానియై, వైష్ణవులలో వైష్ణవుడై, శైవులలో శైవుడై, వేదాంతులలో వేదాంతియై, శాక్తేయులలో శాక్తేయుడై, ఎన్ని సాధనలచేసినా, ఎంతమంది దేవతల దర్శించినా తన ఆరాధ్యదైవమైన జగన్మాతను మాత్రం వదలలేదు ఆయన. మరొక విశేషం. సామాన్యంగా భక్తుల జీవితంలో భగవంతునితో వియోగం కలిగి, వారికి అప్పుడప్పుడు దుఃఖం ఉన్నది. కాని యీ విషయంలో శ్రీ రామకృష్ణుడు మాత్రం ఒక నూతన విషయాన్ని అందించాడు లోకానికి. కాళీమాతను సాక్షాత్కరింపజేసికొనిన రామ కృష్ణుడు, ఆ తల్లి తనను విడిచిపెట్టి వెళ్లలేని పసివాడయ్యాడు. ఇక ఆమె శ్రీరామకృష్ణుని విడిచి వెళ్ళే అవకాశం లేకపోయింది. పసితత్వంతో ఆ తల్లిని బంధించిన రామకృష్ణుడికి వియోగమే లేదు. అంతా ఆనందమే. ఇది శ్రీ రామకృష్ణ దేవుని మాతృఉపాసనలోని ప్రత్యేకత! ఇదే శక్త్యుపాసన లోని పసితత్వం. బాహ్యంగా భక్తిని అంతరంగంగా జ్ఞానాన్ని సమన్వయపరచి బోధించిన సమన్వయావ తారం. లౌకిక విద్యలేని ఆధ్యాత్మిక విజ్ఞాననిధి. సంస్కారహీనులను సంస్కరించిన సుసంస్కారి. సంస్కా రవంతులతో, సంస్కార హీనులతో మెలిగే విధానాన్ని శిష్యులకు నేర్పిన జగద్గురువు. మహాపండితులను పాదాక్రాంతులను గావించు కొనిన మహామనీషి. స్త్రీదైవమైన కాళికామాత ఆరా నతో, భైరవీ బ్రాహ్మణిచే నువదేశింపబడిన తంత్ర సాధనతో, కన్నతల్లియందలి గౌరవ భావంతో, వ్యావ హారిక ధర్మపత్ని యగు శ్రీ శారదామాయి నలౌకిక

దృష్టి వీక్షించి, ఆమెను జగజ్జననిగా అర్చించిన ఉత్తమస్థితితో, సమస్తస్త్రీలను జగన్మాతగనే దర్శించిన శ్రీరామకృష్ణదేవుడు సాధకులకు సర్వదా సంస్మరణీయుడు.

ఈ శక్త్యారాధనా ఫలితముగ నత్యున్నతస్థితి నొందిన అనేకమంది మహానుభావులలో రామ ప్రసాద్, కమలకాంత, శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితులు, శ్రీ రామకృష్ణ పరమహంస మున్నగు వారు ముఖ్యులు. వారిని, వారి శిష్యపరంపరద్వారా, లేక గ్రంథముల ద్వారా గ్రహించుకుంటున్నాము. కాని యీ శాక్తసాధనతో అమానుష శక్తుల నార్జించి, బహుముఖ ప్రజ్ఞాశాలియై, సర్వకళాకోవిదులైన మా గురుదేవులు శ్రీ అనుభవానంద స్వాముల వారిని దర్శించి, వారిసన్నిధిని విద్యాసాధనల సాగిస్తూ, సుమారు యిరువదియైదు సంవత్సరములు అంతేవాసిగా ఉండి, వారిని సేవించే మహాభాగ్యాన్ని పొందాను. ఇది ఆ భగవతి అనుగ్రహంగా భావిస్తున్నాను. శ్రీ స్వామిజీ ద్వారా శక్త్యారాధనలోని గొప్పదనాన్ని గ్రహించి, శ్రీవారి దివ్యాశీస్సుల నందుకున్నాను.

అందుచేత మానవుడు మొదట అపరావిద్య నార్జించి లౌకిక సుఖములపొంది, నీతి నియమముల నాచరిస్తూ, పరావిద్యను గ్రహించి, పరాశక్తి దయను సంపాదించి, మనశ్శాంతిని పొందాలి. మన విద్య మనకు ముందు రావాలి. మన సంస్కృతిలోని విశిష్టతను గ్రహించాలి. మనకు జ్ఞానభిక్ష నందించిన మహాత్ములను గౌరవించాలి. మానవ జీవితం సుఖసంతోషాలను పొందాలనే కోరికతో మన కందించిన ధర్మ సూత్రాల నాచరించాలి. ధనసంపాదనతోబాటు ధర్మగ్రహణ, ధర్మాచరణ, ధర్మరక్షణల విధిగా నిర్వహించాలి. గృహస్థులు తమ సంతానానికి ధనధాన్య గృహక్షేత్రములతో

బాటు ధర్మాన్ని కూడా అందించాలి. ఇది నేటి ప్రపంచానికి అత్యవసరం. లౌకికవిద్యతో బాటు జీవితానికి ప్రశాంతతను ప్రసాదించు ఆధ్యాత్మిక విద్యను కూడా అభ్యసించాలి. భౌతిక విజ్ఞానంతో పాటు యోగరహస్యాలనుకూడా తెలుసుకోవాలి. ప్రపంచంలో ప్రతి వ్యక్తికి ఒక బాధ్యత ఉన్నదని గుర్తించాలి. దుష్టసంకల్పంతో, దుష్టసాంగత్యంలో ఉంటే ఆ దుష్టత్వమే ప్రపంచమంతా వ్యాపించి దుర్మార్గులుగా తయారు అవుతారు. తాను బాగు పడి, ప్రపంచానికి మంచిని అందించటానికే మానవుడు కృషిచేయాలని మరచిపోరాదు. సద్భావన, సత్సాంగత్యం, సత్ప్రవర్తనలతో తాను ఆనందించి, ఆ ఆనందాన్ని సంఘానికి అందించాలి మానవుడు. వ్యక్తి బాగుంటే సంఘం బాగుంటుంది. వ్యక్తి సంఘానికి వేరుకాడు. ప్రతివ్యక్తి సంఘానికి ఒక స్తంభం వంటి వాడు. వ్యక్తి తన వ్యక్తిత్వాన్ని నిలుపుకొని సంఘ గౌరవం కాపాడాలి. సంఘాభివృద్ధికి వ్యక్తియే కారణం. స్వార్థం నశించి 'సర్వే జనా స్సుఖినో భవంతు' అనే విశాల హృదయం మానవునికి రానంతవరకు ప్రపంచంలో అశాంతి తప్పదు. అనగా హృదయం మేల్కొని, విజృంభించాలి. ఇదే మన సనాతన ధర్మం! ఇదే మన ఆర్షసంప్రదాయం! సుఖశాంతులను శ్రీమాత అనుగ్రహించుగాక!

శ్లో॥ సర్వమంగళసంపన్నాం
సర్వానందప్రదాయినీమ్।
ప్రసన్నవదనాం దేవీం
శారదాం ప్రణమామ్యహమ్॥
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః